# గేయం - ఛందస్సు

రచయిత :

డా॥ జి. చెన్నకేశవరెడ్డి

ప్రకాశకులు :

అమృతవాణి

పి. బి. 1588, సికింద్రాబాదు - 500 003.

ప్రతులు 1000

డిసెంబర్ 1980

# మా మా ట

మనిషికి సుఖదుఃఖాలు సహజం. సంతోషంలో చిందులు వేస్తాడు. దుఃఖంలో కృంగిపోతాడు. వీటికి అనుగుణంగా హృదయం స్పందిస్తుంది. ఆ స్పందనలో లయాన్వితమైన భావాలను వ్యక్తం చేస్తాడు మనిషి. అది మనిషి హృదయం నుంచి అప్రయత్నంగా వెలువడుతుంది. అయితే భావాన్ని సంతరించుకొని సాహిత్య రూపంలో వెలువడిన ఈ [illegible] "గేయం" అన్నారు సాహిత్య[illegible]

గే[illegible] అని [illegible] మంది గేయకవిత మార్గకవిత కంటే ముందున్నది. గే[illegible]త నుంచే దేశికవిత జనించినదని పరిశీలన వల్ల తెలిసినది.

వాటినుండి కాలానుగుణంగా పరిణతి చెంది తెలు సర్వత్ర వ్యాపించిన గేయ సాహిత్యం సాహిత్య రంగంలో ఒక ఏర్పరచుకుంది.

సాహిత్యరంగంలో ప్రాముఖ్యతన్ను సంపాదించుకొన్న గేయ రచనను అభివృద్ధి చెందుతున్న రచయితలకు పరిచయం చేయాలనుకున్నాం. 1980 మే 20 నుండి జూన్ 5 వరకు అమృతవాణి శిక్షణా సదస్సును ఏర్పాటు చేశాం. అందులో నవల, కథతో పాటు గేయాన్ని కూడా బోధనాంశంగా ఏర్పరచాం.

ఈ సందర్భంలో 'గేయం - చందస్సు' అంశంపై తెలుగు [illegible]మిలో రిసర్చి అసిస్టెంటుగా పనిచేస్తున్న డా॥ చెన్నకేశవరెడ్డి గారు [illegible] ఉపన్యాసమిచ్చారు. వారు ఇచ్చిన ఉపన్యాసం పుస్తకరూపం [illegible]తుంది. ఈ పుస్తకాన్ని తెలుగు లోకానికి అందిస్తున్నాం. దీన్ని ఆంధ్రావని ఆదరించగలదని ఆశిస్తున్నాం



# ము ౦ దు  మా ట

'గేయం - ఛందస్సు' అనే ఈ చిన్న గ్రంథం ప్రత్యేకించి ఒక గ్రంథంగా ప్రచురించడానికి రచించినది కాదు. అమృతవాణి సాహిత్య విభాగం వారు 1980 మే నెలలో ఆయా సాహిత్య ప్రక్రియల మీద వర్ధమాన రచయితలకు ఒక శిక్షణా సదస్సును నిర్వహించినారు. ప్రత్యేకించి ఈ విషయం మీద నన్ను ప్రసంగించమని కోరినారు. అందుకోసం తయారు చేసిన ప్రసంగ వ్యాసం ఇది. తర్వాత ఈ వ్యాసాన్ని ప్రత్యేకంగా ఒక పుస్తకంగా [illegible] అంగీకరించవలసివచ్చింది. ఈ విషయం మీద ప్రసంగించే అవకాశం [illegible] ప్రసంగ వ్యాసాన్ని ఈ రూపంలో ప్రచురించినందులకు అమృతవాణి సాహిత్య విభాగం వారికి ఎంతో కృతజ్ఞుడను.

ఈ వ్యాసానికి మూలం 'ఆధునికాంధ్ర గేయ కవిత్వం' అనే నా సిద్ధాంత గ్రంథం (పి హెచ్ డి) ఈ వ్యాసానికి అవసరమైనంత వరకు నా సిద్ధాంత గ్రంథం నుంచి సంక్షేపించి, దాదాపు ఎత్తి రాసినాను. ఉదాహరణలు చాలావరకు నా సిద్ధాంత గ్రంథంలో ఉదాహరించిన వాటినుంచే తీసుకొన్నాను. మూల గ్రంథాల పట్టికను నా సిద్ధాంత గ్రంథంలోనే ఇచ్చినాను. ప్రత్యేకించి ఈ గ్రంథంలో చేర్చ్కవలేదు. మరి కొన్ని ఉదాహరణలను డా॥ సంపత్కుమారాచార్య గారు రచించిన 'ఛదః పదకోశం, తెలుగు [illegible] నుంచి, శ్రీ గిడుగు సీతాపతి గారు రచించిన [illegible] అనే గ్రంథం నుంచి గ్రహించినాను అందుకు ఆ రచయితలకు కృతజ్ఞుడను

విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని రాసిన వ్యాసం కాబట్టి, ఛందస్స్వరూపం తెలియడానికి గణాలు, అక్షర మాత్రా గణాలు మొదలైన

ప్రాథమిక విషయాల దగ్గరినుంచి వివరించవలసి వచ్చింది. గేయ ప్రక్రియ పట్ల సరిఅయిన అవగాహన ఏర్పడటానికి ఈ వ్యాసంద్వారా ప్రయత్నించినాము ఆధునిక గేయకవులు గేయంలో చేసిన ప్రయోగాలు త్ర్యస్రాది గతులలో గతికి కొన్నిటిని తీసుకొని విశ్లేషించడం జరిగింది. ఇంతకంటె ఎక్కువ వివరాలు కావలసిన వారు నా సిద్ధాంత గ్రంథాన్ని సంప్రదించవచ్చును. నా సిద్ధాంత గ్రంథంకంటె ముందుగా, అందులోని కొన్ని విషయాలు ఒక పుస్తంగా ప్రచురింపబడటం ముదావహం.

హైదరాబాదు
తెలుగు అకాడమి

డా॥ జి. చెన్నకేశవరెడ్డి
26-11-80

# గేయం - ఛందస్సు

సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాత మధురమ్ అన్యదాలోచనామృతమ్

గేయం, గీతం సమానార్థకాలు. పాడునది గీతం[1] కదా గేయం. గానయోగ్యమైన రచన గేయం. అది కవితాగంధ బంధురమైనప్పుడు గేయ కవిత్వమవుతుంది. సంగీత సాహిత్యాల సమ్యక్ మేళనమైన గేయ కవిత్వం ఆపాతమధురమే కాదు ఆలోచనామృతం కూడా. కవిత్వానికి ఆపాతమాధుర్యం గానంవల్ల సిద్ధిస్తుంది. "కవిత్వానికి గానగుణం స్వాభా [illegible] [illegible]వేశానుభూతుల సమాహారాన్ని వ్యక్తీకరించగల సామర్థ్యం కలది అది ఒకే శ్రుతిలో పాడేది[2] అని క్రిస్టాఫర్ కాడ్వెల్ (Christopher caudwell) భావించినాడు. కవిత్వం శ్రవ్యకళ. శ్రవ్యత ఛందస్సువల్ల చేకూరుతుంది. ఛందస్సుకు నిత్యంగా ఉండవలసిన ధర్మం శ్రవ్యత అని, అన్ని ధర్మాలకంటే అదే గొప్పదని క్షేమేంద్రుడు

---

1. గేయం ఇతి గీతం - గురు బాల ప్రబోధిక (అమరకోశం), పుట. 140.

2. "Poetry is characteristically song, and song is characteristically something which, because of it's rhythm, is sung in chrison, is capable of being the expression of a collective emotion."

(Birth of poetry) Caudwell, Christopher, Illusion and Reality.

వశ్యాకరించినాడు.[3] ఛందస్సుకు ఆంగ్లంలో prosody అని వాడుక. Prosody అంటే (pro=to, ode=sing) "గేయాత్మకత," "గాన యోగ్యత" అని అర్థం.

ఛందస్సులో అక్షర ఛందస్సులని, మాత్రా ఛందస్సులని రెండు ప్రధాన భేదాలు గోచరిస్తాయి. అక్షర ఛందస్సులు పఠన యోగ్యాలైతే [illegible] మాత్రా ఛందస్సులు గానయోగ్యాలు. కనక మాత్రా ఛందస్సు[illegible] రూపంలో ఉన్న కవిత్వాన్ని గేయమని చెప్పవచ్చు.

## గేయం - ప్రాచీనత

ఆదిమ మానవుడు వచనంలో కంటె ముందు లయాత్మకమైన కవితా భాషలో తన ఆలోచనలను వ్యక్తీకరించి ఉంటాడని ప్రముఖ భాషా శాస్త్రవేత్త (Linguist) ఒటో యెస్పర్సన్ (otto Jesperson) భావించినాడు. ఆటవికులు ఏది మాట్లాడినా పాట తీరులోనే ఉంటుందని, వాళ్ళ కంఠస్వరం సంగీత స్వరానికి దగ్గరగా ఉంటుందని, వాళ్ల భాష సంగీతమయంగాను ఉంటుందని, వీటిని బట్టి చూస్తే ఒకప్పుడు భాష ఉం[illegible] మయంగా ఉండేదనీ అవి రెండూ విడదీయరానివిగ ఉండేవని యెస్పర్సన్ ఊహించినాడు. అసలు మాట (భాష) కంటె ముందే పాట పుట్టి ఉంటుందని, పాటలో నుంచే మాట పుట్టి ఉంటుందని ఊహిస్తే విపరీతంగా తోచవచ్చు కాని అది సంభావ్యమే. మానవుడు తన ఆలోచనలను భాష ద్వారా వ్యక్తీకరించడానికి ముందే తన అనుభూతులను పాడుకొని ఉంటాడని యెస్పర్సన్ ఊహించినాడు కనుక మాట కంటె ముందే పాట పుట్టడం సంభవమే అయినా ఆ పాట ఆట (నృత్యం)తో కలసి పుట్టింది. నృత్యం, సంగీతం, కవిత్వం – ఈ మూడు కళలూ ఒకే పాదు నుంచి జనించి ఉంటాయని జార్జి థాంప్సన్ (George Thompson) Marxism and Poetry లో అభిప్రాయ పడినాడు. "ఆటవిక మానవుడు ఆంగిక చేష్టల ద్వారా, గంతులు చిందుల ద్వారా ఒంటి కదలికలను

---

3. అవ్యభిచారేణ శ్రవ్యత్వే వ-గరీయసి - సువృత్త తిలకమ్ 2-8.,

(అయను) వ్యక్తి కరిస్తూ నృత్యానికి, పొలి కేకలద్వారా అర్ధ రహితమైన అరుపుల ద్వారా కవిత్వానికి, కర్రలతోనూ, రప్పలతోనూ కొడుతూ అకృత్రిమమైన ధ్వనులు కలిగించి సంగీతానికి బీజం వేసినాడని, క్రిస్టొఫర్ కాడ్వెల్ Illusion and Reality అనే గ్రంథంలో అభిప్రాయ పడినాడు.

భాష పుట్టుకను గురించి ఏ భాషా శాస్త్రవేత్తా ఇదమిత్థంగా చెప్ప లేదు. అయితే ప్రాణికోటిలో భాష చోటు చేసుకొన్నప్పటి నుంచే "మనిషి"గా పరిణమించడం మొదలు పెట్టినాడు. భాష పుట్టి ఎన్ని లక్షల, వేల సంవత్సరాలైనదో కాని, ఐదువేల సంవత్సరాల క్రితమే భాష ఉన్న దని చెప్పడానికి ఆధారాలున్నాయి. (C. M. Bowra - Primitive song). క్రీ.పూ. 2500 ప్రాంతం నాటికే పాటలు ఉన్నట్లు సుమేర్, ఈజిప్ట్ లిఖిత గ్రంథాలలో ఆధారాలు కనిపిస్తున్నాయని బౌరా (C. M. Bowra) భావించినాడు. వేదకాలం క్రీ. పూ మూడువేల సంవత్సరాల నాటిదని చారిత్రకుల ఊహ. వేదాలు ఉదాత్తాను దాత్త స్వరిత స్వరయుతాలు. వేదాలకు స్వరము, గతి ప్రధానము. కనుక వేదాలు గేయలక్షణమున్నవి. వేదాల ఋక్కులు గేయాలే, అని గిడుగు సీతాపతి గారు అభిప్రాయ పడి నాడు (తెలుగులో ఛందోరీతులు - పుటలు 52) - సామవేదం గేయమని, మిగిలిన మూడు వేదాలు పాఠ్యములని అంటారు. గానం సామ వేదంనుంచే పుట్టిందని సంగీతజ్ఞుల అభిప్రాయం.

ఆది కావ్యమైన రామాయణాన్ని కుశలవులు శ్రుతివేసుకొని పాడే వారట. "పాఠ్యేగేయేచ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్ - జాతిభి స్సప్తభిర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్ ... .. కావ్యమే తదగాయతామ్"– అని రామాయణంలోనే ఉన్నది. వాల్మీకి 'తంత్రీలయ సమన్వితమ్' అనే మాటను రామాయణంలో అనేక సందర్భాలలో వాడినాడు. 'తంత్రీ లయ సమన్వితమ్' అనేమాట Lyrical అనే మాటకు చక్కగా సరి పోతున్నది. గేయ కవిత్వానికి ఆంగ్లంలో 'Lyrical poetry' అనే పదాన్ని పర్యాయపదంగా స్వీకరించవచ్చు. 'Lyre' అనే జంత్ర వాద్య సహాయంతో పాడే రచనను 'Lyrical poetry' అంటారు. ఇలియడ్

(Iliad)5. ఒడిస్సీ (Odessey) అనే రెండు మహా కావ్యాలను రచించిన గ్రీకు కవి హోమర్ (Homer) కూడా ప్రభువుల ఆస్థానాలలో 'లైరు' అనే జంత్ర వాద్య సహాయంతో ఆ రెండు కావ్యాలను పాడి వినిపించే వాడని ప్రతీతి. దీనిని బట్టి ప్రపంచ ప్రసిద్ధి చెందిన తొలి కావ్యాలన్నిటా గాన సంప్రదాయం ఉండేదని తెలుస్తున్నది.

## ఛందస్సు - కవిత్వం

చది (=అహ్లాదే) ధాతువు నుంచి ఛందస్సు ఏర్పడింది. ప్రాచీన లాక్షణికులు కవిత్వ రూపాన్ని నిర్దేశించక పోయినా కవిత్వమంటే ఛందోబద్ధమనే అభిప్రాయం లోకంలో రూఢిగా ఉంది. "విద్యల లోపల నుత్తమ విద్య కవిత్వము, మరి కవిత్వము ఛందో వేద్యము" – అని అనంతుడు అన్నాడు. కవిత్వంలో వస్తు హృదయ కేశాలైన గురు లయలు ఛందస్సాధ్యాలు.

"సంగీతాత్మకమైన ఆలోచన కవిత్వము4," లయబద్ధమైన సౌందర్య సృష్టి కవిత్వము.5 ఛందోబద్ధమైన రచన కవిత్వము6. ఛందోమయ భాషలో భావన, ఆలోచన, అనుభూతి – వీటి సముచిత వ్యక్తీకరణం వల్ల ఆనందం పుట్టించే కళ కవిత్వం7 – మొదలైన నిర్వచనాలన్నీ కవిత్వానికీ, ఛందస్సుకూ గల సంబంధాన్ని వెల్లడిస్తున్నాయి. ఆనందము, ఉపదేశము (To teach and delight) కవితా ప్రయోజనాలైతే, అందులో ఆనందం కొంతవరకు ఛందస్సువల్ల కలుగుతుంది ఛందస్సు యొక్క పరమ ధర్మం శ్రవ్యత.

---

4. 'Poetry we will call musical thought' - Carlyle.
5. The rhythmic creation of beauty – E. A. Poe.
6. Poetry is metrical composition - Johnson.
7. Poetry is the art of producing pleasure by the just expression of imagination, thougt and feeling in metrical language - Prof. Courthope.

## ప్రధాన - ఛందోభేదాలు:

ఛందస్సులలో మూడు ప్రధాన ఛందోభేదాలు గోచరిస్తాయి. 1. మాత్రా ఛందస్సులు (Matrics) 2. అక్షర ఛందస్సులు (Syllabic) 3. స్వర ఛందస్సులు (tonic) 1. మాత్రా ఛందస్సులు కాల పరిమాణం (Quantity) మీద ఆధారపడినవి. వీటికి ప్రమాణము (Unit) మాత్ర. మాత్రా సంఖ్యానియతంగా ఉండేవి మాత్రా ఛందస్సులు. గేయాలు మాత్రా ఛందస్సులు.

2 అక్షర ఛందస్సులు : అక్షరం యొక్క గుణం (Quality) మీద ఆధారపడినవి. అంటే ఇందులో అక్షరాలస్థానం ముఖ్యం. అంటే గురు లఘువుల క్రమం ముఖ్యం. అక్షరాల సంఖ్య కూడా నియతంగా ఉంటుంది వృత్తాలు అక్షర ఛందస్సులు.

3. స్వర ఛందస్సులు (Tonic) స్వరం యొక్క ఉదాత్త, అనుదాత్త, స్వరితాల మీద ఆధారపడినవి స్వర ఛందస్సులు. ఊనిక (stressed) ఉన్న అక్షరం (Syllable), ఊనిక లేని అక్షరం (unstressed syllable) వీటి సమూహం వల్ల ఏర్పడేవి స్వర ఛందస్సులు. ఆంగ్ల భాషా ఛందస్సు ప్రధానంగా స్వర ఛందస్సు. వైదిక ఛందస్సు కొంత వరకు స్వర ఛందస్సు మరి కొంతవరకు అక్షర ఛందస్సు.

## ఛందస్సు - పరిభాష

మాత్ర : మాత్ర అంటే రెప్పపాటు కాలమని అర్థం. చిటిక వేయడానికి పట్టే కాలాన్ని కూడా మాత్ర అంటారు. రెప్పపాటు కాలంలో ఉచ్చరించే ధ్వనిని మాత్ర అని అంటారు. కాల పరిమాణానికి మాత్రను ప్రమాణంగా తీసుకొంటారు. లఘువు ఏకమాత్ర కాలోచ్చరణ గలది, గురువు ద్విమాత్రా కాలోచ్చరణ కలది. ప్లుతము త్రిమాత్రికము.

**అక్షరము** : ఛందశ్శాస్త్రంలో అక్షరాన్ని, వర్ణాన్ని పర్యాయ పదాలుగానే పరిగణిస్తారు. అక్షరమంటే వర్ణము అకారాది చిహ్నము. ధ్వని సంకేతం ఖండించడానికి వీలుకాని మూల ధ్వనినే అక్షరమని అంటారు. అక్షరాలు స్వర, వ్యంజనాలని రెండు విధాలు. ఛందస్సులో మాత్రం అ, ఆ, క, కా, - ఇవన్నీ వర్ణాలే. సంయుక్తాక్షరాన్ని (క్మా, ర్లే) కూడా వర్ణంగానే పరిగణిస్తారు.

లఘువు : ఏక మాత్రా కాలంలో ఉచ్ఛరించే అక్షరానికి 'లఘువు' అని పేరు. అంటే హ్రస్వాక్షరాలన్నీ లఘువులే. హ్రస్వాక్షరాలు ద్విత్వాలుగా ఉన్నా, సంయుక్తాలుగా ఉన్నా లఘువులుగానే వాటికి పరిగణన. లఘువును 'ల' అని (సంక్షిప్తంగా), నిలువు గీతతో '।' సూచించడం తెలుగు ఛందశ్శాస్త్రాల సంప్రదాయం.

*గురువు* : ద్వి మాత్రా కాలంలో ఉచ్ఛరించే అక్షరానికి 'గురువు' అని సామాన్య నిర్వచనం. దీర్ఘాక్షరాలు (ఆ, కా మొ॥) వక్రతమాలు (ఐ, ఔ) గురువులు. ఛందశ్శాస్త్రంలో కొన్ని సందర్భాలలో లఘువును కూడా గురువుగా పరిగణిస్తారు. 1పూర్ణ బిందువుతో కూడిన అక్షరాలు ఉదా : *అందము* 2 పొల్లులతో కూడిన అక్షరాలు – ఉదా : *విన్ కన్* 3 సంయుక్త, ద్విత్వాక్షరాలకు ముందున్న అక్షరము-ఉదా: *విద్య, అమ్మ* 4. విసర్గతో కూడిన అక్షరాలు – ఉదా : *దుఃఖము* 5. పాదాంతంలో ఉండే లఘువు కూడా ఒక్కొక్కప్పుడు గురువవుతుంది. (పాటలలో మాత్రమే పాదాంతలో ఉన్న లఘువు ఒక్కొక్కప్పుడు గురువవుతుంది).

గూటిలోని రామచిలుక ఎగిరిపోతోంది.

గురువు ద్విమాత్రికమని, అది రెండు లఘువులకు సమానమని ఛందశ్శాస్త్రవేత్తల పరిగణన. కాని గురువు రెండు లఘువులకు సమానమనే దానికి అక్షర ఛందస్సులలో ప్రయోజన మేమీ కనిపించదు. అంటే గురువుండవలసిన చోట రెండు లఘువులుంచితే గణభంగమవుతుంది. అక్షర

ఛందస్సులలో గురువు గురువే. మాత్రా ఛందస్సులలో గురువు రెండు లఘువులకు సమానమే గురువుండవలసిన చోట రెండు లఘువుల నుంచితే గతి భంగమేమీ కాదు. అక్షర ఛందస్సులలో లఘువు లఘువే. గురువు గురువే. పాటలలో ఒక్కొక్కప్పుడు లఘువును గురువుగాను (ద్విమాత్రా కాలం), గురువును లఘువుగాను (ఏకమాత్రాకాలం) ఉచ్చరించడం ఉన్నది

ఛందశ్శాస్త్రంలో గురువును 'గ' అని వ్యవహరిస్తారు. తెలుగు ఛందశ్శాస్త్రాలలో గురువును తలకిందుగా వ్రాసిన ఒకటి '౧' (తెనుగు అంకె) సంజ్ఞతోగాని, అర్ధ చంద్రాకారం గుర్తు '౮'తో గాని సూచిస్తారు.

ప్లుతం :– ఒక అక్షరాన్ని మూడు మాత్రల కాలం సాగదీసి పలికితే దానిని ప్లుతమంటారు. గేయ ఛందస్సులలో ప్లుతం సాధారణంగా శ్రుతమవుతూ ఉంటుంది.

## గణాలు

'గణ్' ధాతువుకు లెక్కించడం అని అర్థము. పాదంలోని అక్షరాలను, మాత్రలను లెక్కించడానికి ఏర్పరిచిన ప్రమాణం గణం. గణం అంటే సమూహం (గుంపు): మూడు గురువులు కాని, మూడు లఘువులు కాని, గురు లఘువుల కలగలుపుగా ఏవైనా మూడక్షరాలను కాని 'గణం' అని అనడం సంప్రదాయం కాని రెండు, నాల్గు, అయిదు, అక్షరాల సమూహానికి కూడా గణమనే వ్యవహారం ఛందశ్శాస్త్రాలలో ఉన్నది. మూడక్షరాలున్న గణాలు విసర్గగణాలని, మిగతా గణాలను ఉపగణాలని వ్యవహరిస్తారు.

వృత్త పాదంలో గురులఘువులు ఏయే స్థానాలలో ఉండాలో చెబితే ఆ పాదానికి లక్షణం చెప్పినట్లవుతుంది. భరతుడు ఈ పద్ధతి ననుసరించే వృత్తాలకు లక్షణం చెప్పినాడు. అట్లా చెప్పిన లక్షణాన్ని జ్ఞాపకం ఉంచు

కోవడం కష్టం. లాఘవం కోసం పింగళుడు త్రిక (మూడక్షరాల గణ) వ్యవస్థను ఏర్పరచినాడు.

గణాలను ప్రధానంగా అక్షరగణాలని, మాత్రా గణాలని విభజించినారు.

*అక్షరగణాలు* :— అక్షర గణాలు గురు లఘువుల స్థానాన్ని నిర్దేశించేవి. మూడు గురువులను ప్రస్తరిస్తే మొత్తం ఎనిమిది గణాలు ఏర్పడతాయి.

| | | |
|---|---|---|
| మగణం = మ = | UUU | శ్రీనాథా |
| యగణం = య = | IUU | ముకుందా |
| రగణం = ర = | UIU | మాధవా |
| సగణం = స = | IIU | వరదా |
| తగణం = త = | UUI | వైకుంఠ |
| జగణం = జ = | IUI | మురారి |
| భగణం = భ = | UII | విష్ణువు |
| నగణం = న = | III | విభుడు |

రెండు గురువులను ప్రస్తరిస్తే నాలుగు గణాలు ఏర్పడతాయి. అవి ఇవి.

| | | |
|---|---|---|
| 1. గగ | UU | కృష్ణా |
| 2. వ గణము (లగ) | IU | హరీ |
| 3. హ గణము (గల) | UI | శౌరి |
| 4. లలము | II | హరి |

**మాత్రా గణాలు :** అక్షరాల (గురు లఘువుల) సంఖ్యకు ప్రాధాన్యం లేకుండా రూపొందిన గణాలు మాత్రా గణాలు. ఈ గణాలలో మాత్రా సంఖ్య కూడా నియతంగా ఉండదు అంటే పద్య పాదాలలో మాత్రా గణాలు వరుసగా సరిపోయినా ఆ పాదాల మాత్రా సంఖ్య ఒక్కటిగా ఉండదు. ఇటువంటి గణ వ్యవస్థ తెలుగు, కన్నడ భాషలకు ప్రత్యేకమైనది. ఈ మాత్రా గణాలను మళ్ళీ రెండు వర్గాలుగా విభజించడం జరిగింది. 1 మాత్రా గణాలు 2. మాత్రా సంఖ్యా గణాలు.

**1. సూర్యగణాలు :** సూర్యగణాలు మొత్తం నాల్గు. మూడు, నాలుగు మాత్రల గణాలు వీటిలో ఉన్నవి.

1. గగ — UU
2. సగణము — IIU
3. గలము - హగణము — UI
4. నగణము — III

లాక్షణికులు మిగిలిన రెండు గణాలను (గల, నగణము - త్రిమాత్రా గణాలు) సూర్యగణాలుగా పేర్కొన్నారు.

**ఇంద్ర గణాలు :** ఇంద్ర గణాలు మొత్తం ఎనిమిది. వీటిలో నాలుగు, ఐదు, ఆరు మాత్రలు గల గణాలున్నవి.

1. మగణం — UUU
2. సగము (స+గురువు) — IIUU
3. రగణం — U U
4. నగం (న+గురువు) — IIIU
5. తగణం — UUI
6. హలం (హ+లఘువు) — UI
7. భగణం — UII
8. నలం — IIII

లాక్షణికులు ఇంద్ర గణాలలో కూడా మొదటి రెండిటినీ వదిలిపెట్టి మిగతా ఆరు గణాలను (నల, నగ, సల, భ, ర, త,) ఇంద్రగణాలుగా స్వీకరించినారు. ఇంద్ర గణాలలో నాలుగు, ఐదు మాత్రలకు మించి ఉండవు. మూడు గురువులను ప్రస్తరిస్తే ఏర్పడిన ఎనిమిది గణాలలో లఘ్వాది గణాల ముందు అదనంగా ఒక లఘువు చేరిస్తే ఏర్పడిన గణాలివి చంద్ర గణాలకు తెలుగులో అంతగా ప్రయోగం లేదు అందుకే వాటిని గురించి వివరించడం లేదు.

*మాత్రా సంఖ్యా గణాలు* : మాత్రా సంఖ్యను (కాల ప్రమాణాన్ని) బట్టి రూపొందినవి మాత్రా సంఖ్యా గణాలు. మాత్రా గణాలకు మాత్రా సంఖ్యా గణాలకు కొంత భేదమున్నది. మాత్రా గణాలలో మాత్రా సంఖ్య సమానంగా ఉండదు. అవి కూడా గురు, లఘువుల వల్ల ఏర్పడినవే కాని మాత్రాసంఖ్యను బట్టి ఏర్పడలేదు. ఇంద్ర, చంద్ర గణాలలో అన్నిటా మాత్రాసంఖ్య సమానంగా ఉండదు. నాలుగు, ఐదు ఆరు మాత్రల గణాలు ఇంద్ర గణాలలో ఉన్నాయి. ఒక్క సూర్య గణాలు త్రిమాత్రా గణాలు. కాని 'లగం' త్రిమాత్రా గణమైనా సూర్య గణంగా స్వీకరించలేదు. అట్లాగే ఇంద్ర గణాలలో చతుర్మాత్రా గణాలు, పంచమాత్రా గణాలు అన్నీ లేవు. కొన్నిటిని మాత్రమే స్వీకరించినారు. ఇట్లా కొన్నిటిని మాత్రమే స్వీకరించినందువల్ల దేశీవాఙ్మయమైన గేయాలు చాలా వరకు లక్షణవంతం కాలేదు. అట్లాగే ఒకే విధమైన మాత్రా సంఖ్య గల గణాలన్నిటినీ ఒక వర్గంగా రూపొందించిఉంటే సమంజసంగా ఉండేది. అంటే త్రిమాత్రా గణాలను సూర్య గణాలనీ, చతుర్మాత్రా గణాలను ఇంద్ర గణాలనీ, పంచ మాత్రా గణాలను చంద్ర గణాలనీ, షణ్మాత్రా గణాలను రుద్ర గణాలనీ ఈ రకంగా ఆ మాత్రా సంఖ్యగల గణాలను వేర్వేరు పేర్లతో వర్గీకరించి ఉంటే సమంజసంగా ఉండేది కాని లాక్షణికులు ఆ విధంగా చేయలేదు. దేశి పద్యాలకు, గేయాలకు మగణాది అక్షర గణాలచేతను, సూర్యాది మాత్రాగణాల చేతను లక్షణం చెప్పడంవల్ల

ప్రయోజనం లేదని, మాత్రాసంఖ్యా గణాలతో లక్షణం చెప్పడం సమంజసమని ఛందశ్శాస్త్ర విమర్శకులు అభిప్రాయపడినారు.

మాత్రా సంఖ్యా గణాలు కాల ప్రమాణాన్ని బట్టి ఏర్పడినవి వీటిని మాత్రా సంఖ్యతో సూచిస్తారు. ఉదా. త్రిమాత్రా గణాలు, చతుర్మాత్రా గణాలు మూడు మాత్రల కాలంపాటు ఉచ్చరింపబడిన వాటిని త్ర్యస్ర (త్రిశ్ర, తిశ్ర) గతులని, అట్లాగే చతురస్ర (నలుగు మాత్రలు), ఖండ (ఐదు మాత్రలు), మిశ్ర (ఏడు మాత్రలు), సంకీర్ణ (తొమ్మిది మాత్రలు) గతులని అంటారు మాత్రా గణాలను ఆవృతాలని (ఆవృతులు) కూడా అంటారు. . గురు లఘువుల గుర్తులతో (U, |) సూచించినట్లే ఆవృతులలోని మాత్రలను త,క,కి,ట, అనే అక్షరాల (జతుల)తో సూచిస్తారు. త్ర్యస్ర గతిలో నడచేవాటిని 'తకిట' అని, చతురస్రాలను 'తకకిట, కిటతక' అని ఖండాలను 'తకతకిట' అని ఈ విధంగా కూడా సూచిస్తారు. మాత్రా సంఖ్య గణ ప్రస్తారం.

1. ద్విమాత్రా గణాలు :- గ లల

2. త్రిమాత్రా గణాలు, త్ర్యస్రములు.- నగణము
U హగణము (గల) } సూర్యగణం
U వగణము (లగ) - విలోమ గతిగణము

3. చతురస్రములు - నాలుగు మాత్రల గణములు

III - నలము

UII - భగణము

IIU - సగణము

UI - జగణము

UU - గగము

4. ఖండగతి గణములు — అయిదు మాత్రలు గలవి :-

IIII I — నలలఘు
UIII — భలము
UUI — తగణము
U U — రగణము     ఇంద్ర గణాలలో ౫ మాత్రలు గలవి.
I U — నగము
IUI — సలము

IUII — జలము
IUU — యగణము     విలోమగతి గణము

౬ షణ్మాత్రా గణాలు : ఆరు మాత్రలు గలవి

IIIIII — నసగణము;
U — సలలము
I U — నవము
IUU — సగము
UI — నహాము
UII — భలలము
UUII — తలము
UIU — రలము హాహాము
U U — హవము
UUU — మగణము

IU I — జలలము, లేక వ+నగణము
I UI — యలము లేక వ+హాగణము     విలోమగతి గణాలు
IU U — జగము లేక వ+వ+వగణాలు

6. మిశ్రగతి గణాలు - ఏడు మాత్రలు

ఇవి 3 + 4 గా గాని 2 + 5 గా గాని విభక్త మవుతాయి.

I - న నలము
U - ననము
IIUUI - నహాము
I UIU - సవము
I IU - ససము
III U - నజము
I U - నభము
I UU - నగగము
U I - భనము
UU - తలలము
UUUI - మలఘు
UUIU - తగము
U IIU - భవము
UI U - భహాము
[illegible]IUII - భలలము, [illegible]రసము
UIUU - [illegible]తగము

IUIII - జనము
IUU - యలలము
U U - జవము      విలోమగతి గణాలు
UUU - యగము
IUIU - జహాము

సంకీర్ణగతి గణములు :- తొమ్మిది (4 + 5; 5 + 4) మాత్రలు గలవి. మిశ్రగతి గణాలు ప్రస్తరించినట్లుగానే వీటిని కూడా ప్రస్తరించి

చూపవచ్చు. ఇవి కూడా మూడు విధాలుగా విభక్తాలు కావచ్చును. 3+3+8 గా విభక్తాలయినప్పుడు ఇవి మూడు త్ర్యస్రగతి గణాలే అవుతాయి. 2+7 గా విభక్తమైనప్పుడు మిశ్రజాతి రూపక గతి గణాలవుతాయి. 4+5 గా కాని, 5+4 గా కాని విభక్తమైనప్పుడు సంకీర్ణగతి గణాలవుతాయి. తెలుగులో ఎనిమిది, తొమ్మిది మాత్రల గేయాలు చాలా తక్కువ. అందువల్ల వివరించలేదు.

తెలుగు, కన్నడ భాషలలో గేయాలు ఎక్కువగా త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర గతులలో నడుస్తాయి. ఈ నాలుగిటిలో ఖండ, మిశ్ర (త్రిస్ర+చతురస్ర) గతులకే ప్రాచుర్య మెక్కువ. దీనికి కారణము ఈ రెండు భాషలలోనూ అయిదు మాత్రలకు మించిన పదాలు దాదాపు చాలా తక్కువే అని చెప్పాలి.

## పాదం :-

పాదమంటే కాలు, నాలుగోభాగము మొదలయిన అర్థాలున్నాయి. నియతాక్షర సంఖ్యతోను, లేదా నియత మాత్రా సంఖ్య తోను ఏర్పడిన ఒక పంక్తిని "పాదం" అంటారు. అక్షరాలు, మాత్రలు గణాలు ఏర్పడగా, అటువంటి కొన్నిగణాల సముదాయపు పంక్తి పాదం అవుతుంది. పద్యంలో నాలుగో భాగాన్ని 'పాదం' అని సాధారణంగా వ్యవహరిస్తారు. నాలుగు పాదాలు గల పద్యాలే సర్వసాధారణం. గేయాలకు పాదనియతి ఉండదు. కాని పరిసంఖ్యతో పాదాలుండటం సంప్రదాయం. పద్యానికి పాదం ఒక ప్రమాణం (unit). పాదానికి గణం ప్రమాణము. గణానికి మాత్ర లేదా అక్షరం ప్రమాణం. లాక్షణికులు లక్షణాన్ని ఒక పాదానికే చెబుతారు. మిగతా పాదాలను ఆ విధంగానే నిర్మించుకోవాలి. పాదానికే చరణమని కూడా పేరు. కాని, సంగీత ప్రాధాన్యమున్న గేయాలలో పల్లవి తర్వాతగాని అనుపల్లవి తర్వాతగాని ఉన్న గేయభాగాన్నంతా 'చరణం' అనడం సంప్రదాయం.

## వృత్తాలు, జాత్యుపజాతులు, గేయాలు భేదసాదృశ్యాలు

పాదబద్ధమైనది పద్యం (వృత్తం). వృత్తాలు భగణాది అక్షరగణాల చేత ఏర్పడతాయి. వృత్తాలు సంస్కృత అక్షరగణ ఛందస్సులు. గురు లఘువుల క్రమం, అక్షర సంఖ్య నియమితం, ప్రధానం.

ఉపగణాలైన సూర్య, ఇంద్ర మాత్రా గణాలతో ఏర్పడే పద్యాలను జాతులు (ప్రాసనియమం ఉన్నవి), ఉపజాతులు (ప్రాస నియమం లేనివి) అంటారు. జాత్యుపజాతులు దేశి పద్య ఛందస్సులు దేశీయ పద్యాలన్నీ ఒకప్పుడు గేయాలే సంస్కృత లాక్షణికులు దేశభాషా గేయాలకు లక్షణం అక్షర గణ పద్ధతిలో చెప్పడం వల్ల మాత్రాగణ పద్ధతి అనే ఒక అభూత పద్ధతి (False method) కల్పించుకొని, ఆ పద్ధతికి లొంగిన లక్ష్యాలకే లక్షణం చెప్పి, వాటిని 'జాతులు' అని పేర్కొన్నారు. జాతులు వృత్త ఛందస్సులకూ, గేయ ఛందస్సులకూ మధ్య నిలిచినవి. అంటే గేయ ఛందస్సులను వృత్త ఛందస్సులుగా మలచుకొనే ప్రయత్నమే జాతులు వృత్త ఛందస్సులలో గురు లఘువుల క్రమమూ, అక్షర సంఖ్యా నియతమైనవి. మాత్రా సంఖ్యకూడా నియతం. కాని వృత్తాలలో లయ నిర్దిష్టం (Fixed) గా ఉండదు. ఒకే వృత్తాన్ని వివిధ గతులలో నడపవచ్చును. గేయ (మాత్రా) ఛందస్సులకో అక్షరకాల పరిమాణం (Syllabic quality) ప్రధానం. మాత్రా సంఖ్య నియతంగా ఉండటం వల్ల [illegible] నిర్దిష్టం (fixed) గా ఉంటుంది. మాత్రాగణ ఛందస్సులైన జాతి పద్యాలలో వృత్తాలలో వలె గురు లఘువుల క్రమం గాని, అక్షర సంఖ్య గాని, గేయాలలో వలె మాత్రా సంఖ్య గాని నియతంగా ఉండవు. మాత్రా గణాలు మాత్రం నియతాలు.

**లయ :-**

లయ గేయానికి జీవం. లయ సామ్యాన్ని తెలుపుతుంది. "ఒక నిర్ణీత కాలంలోగాని కొన్ని విరామకాలాలలో గాని కొన్ని ధ్వనులు, అంగిక చలనాలు మొదలయినవాటి పునః ఆవృత్తి శ్రేణిలయ" అని ఆంగ్లేయ విమర్శకుడు బోస్టన్ (Boston) లయ (Rhythm)ను నిర్వచించినాడు

---

'The serial recurrence of a given time interval or group of time intervals, marked off by sounds, organic movements etc. - Quoted by chatmon 'A theory of metre' (chapter II - P. 18)

"విశ్వచైతన్యస్పందమే లయ. భగవంతుడే దానికి జనకుడు. సామాన్యంగా అన్ని కళలవలెనే కవిత్వంకూడా పూర్తిగా లయబద్ధమైనది." అని F. S Omond తెలిపినాడు. లయనే ఆంగ్లంలో "Rhythm" అని అంటారు. ఆంగ్లంలో "Rhythm" సంస్కృతంలో ఋతం ఒక్కటే.

ఋతుచక్రభ్రమణం, సముద్రతరంగ చలనం, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు- ఇవి లయస్వరూపాన్ని అనుభావించడానికి తోడ్పడే ఉపమానాలు. సమస్త ప్రకృతి లయబద్ధం. ప్రకృతే లయ తప్పితే ప్రళయంకాదా. వసంతం గ్రీష్మం, వర్షం, శరత్తు - ఇవి క్రమం తప్పకుండా ఒకదాని తరవాత ఒకటి వస్తాయి. ఈ క్రమం ఋతుచక్రంలోని లయను తెలుపుతుంది. లయలో పునరావృత్తి ఉన్నది; కొత్తదనం కూడా ఉన్నది, నిలకడ ఉన్నది. మార్పు ఉన్నది అని ప్రభాకర్ పాధే 'what is Rhythm' అనే వ్యాసంలో అంటాడు.

ఇంకొక ఉదాహరణ: మానవుడు నడిచేటప్పుడు చేతులు ఊపుకుంటూ నడుస్తాడు. చేతులు ఊపనిదే నడవలేడు అట్లా చేతులు ఊపడం, అతని నడకలోని లయను తెలుపుతుంది లయ హృదయగతం కదా. మానవుడు తీవ్రానుభూతులకు లోనైనప్పుడు లయ ఉధృతమై అడుగులు వేగంగా పడతాయి. చేతులు కదలికలు కూడా వేగంగానే ఉంటాయి.

లయ అంటే ఖండాల పరస్పర సామ్యం. కాలపుతునకల పరస్పర సామ్యం నడకకు కాలమాత్రంలో ఏమాత్రం భేదం, ఎగుడు దిగుళ్ళు ఉండక ఒకటే ఋతుగా నిరంతరంగా వర్తించడం లయ — లయనుంచే తాళం శాస్త్రీయంగా అభివృద్ధిపరిచినారు.

## గేయ ఛందస్సులు - *రగడలు*

*రగడలు*:- మాత్రాసంఖ్యగల గణములు సమసంఖ్యలో నున్నవి రగడలు అనేక గేయఛందస్సులకు రగడలే మూలమని చెప్పవచ్చును. అనంతుని నుంచి అనంతర లాక్షణికులు నవవిధ రగడలకు లక్షణం చెబుతూ వచ్చినారు. కాని ప్రధానమైన రగడలు నాలుగే ఈ రగడలను రెట్టించడం వల్ల మిగతా రగడలు ఏర్పడతాయి రగడలకు అద్యంత్య ప్రాసలు

నియతం. అంత్యప్రాస రగడల విశిష్టలక్షణం. రగడలు త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రగతులను బట్టి ఏర్పడినవి కాని లాక్షణికులు రగడలకు గణాలను పేర్కొన్నారు. విలోమగతి గణాలను నిషేధించడమే వారి ఉద్దేశమైనందువల్ల రగడలకు మాత్రా సంఖ్యనుబట్టి కాక, గణాలను బట్టి లక్షణం చెప్పినారు లాక్షణికులు రగడలకు త్రిమాత్రా గణాలలో లగం, చతుర్మాత్రా గణాలలో జగణాన్ని, పంచ మాత్రా గణాలలో జల, యగణాలనూ నిషేధించినారు. కాని కవులు లాక్షణికులు విధించిన ఈ నియమాలను సరిగా పాటించలేదు. విలోమగతి గణాలను కూడా వాడి, రగడలకు గమన వైవిధ్యం కలిగించినారు.—ఆద్యంత్య ప్రాసలను కూడా అక్కడక్కడా పాటించలేదు. ఆధునిక గేయ కవులు కూడా ఆద్యంత్య ప్రాసలను ఐచ్ఛికంగానే పాటించినారు. ఆధునిక గేయ రచనలలో ఎక్కువగా రగడలు, రగడ భేదాలే కనిపిస్తున్నాయి. కనుక రగడ లక్షణాలను వివరంగా పరిశీలించడం అవసరం. లాక్షణికులు నిర్దేశించిన గణాలను కుండలీకరిస్తున్నాను.

హయప్రచార రగడ :- త్ర్యస్రగతి - 3+3+3+3 (నాలుగు సూర్యగణాలు, తృతీయ గణాద్యక్షరం యతి.

ఉదాహరణ:

వేళ జూడ వెన్న లాయె
వెండి కట్ల కిన్నెరాయె
మల్లె పూ- పంది రాయె
నవ్వులోనె తెల్ల వారు

2. మధురగతి రగడ = చతురస్రగతి = 4+4+4+4 (నగ, భ, జ, స
వల గణాలలో ఏవైనా నాలుగు గణాలు) తృతీయగణాద్యక్షరం యతి.

'పదియా' ర్వన్నియ - బంగరు వలపును
మెదిలెడి తళుకుల — మేఖ చెలువును

3. ద్విరదగతి రగడ = ఖండగతి, 5 + 5 + 5 + 5 (నగ, నలల, భల, సగ, త, రగణాలలో ఏవైనా నాలుగు గణాలు). తృతీయ గణాద్యక్షరం యతి.

ఓహాంసి, నీచేత - నున్నయది, నా బ్రదుకు
నాహృదయ, మింతిడెం - దము నేక ముగ నదుకు

4. హరిణగతి రగడ - మిశ్రగతి 3 + 4 + 3 + 4 (సప్తమాత్రా గణాలు రెండు, త్రిమాత్రా చతుర్మాత్రా గణాల కలగలుపు) అంటే సూర్యగణం తర్వాత, ఈ గణాలలో ఏదైనా ఒకటి రావాలి.) ద్వితీయ గణాద్యక్షరం యతి

ఉదాహరణ :- మేలు - కొనవే - చంద్ర - శేఖర
మేలు - కొనవే - ఇంద్ర - వందిత
ఫాల - లోచన - నీల - కంఠా
మేలు - కొనవ - య్యాహా - రహరా

5. తురగ వల్గన రగడ - హయ ప్రచార రగడకు రెట్టింపు. ఎనిమిది త్రిమాత్రా గణాలు పంచమ గణాద్యక్షరం యతి

ఉదా - దశర థావ నీశ విమల - శరత పః ఫ లావ తార
నిశిత శరల ఘు ప్రయోగ - నిహత తాట కావి హోర

6. విజయమంగళరగడ - తురగవల్గన రగడకు రెట్టింపు. 16 త్రిమాత్రా గణాలు. 5, 9, 13 వగణాద్యక్షరం యతి.

ఉదా:-

(1) విజయ మంగ ళప్ర సక్త - వెలయ భవ్య మహిత భక్త
-విరళ చిత్త వృత్త రక్త - వితత మంద బుధకు దుక్త

(2) విజిత విశత విషయ శక్తి - వృద్ధి నంద దలతు వ్యక్తి
-విలసి తాత్మ కలిత ముక్తి - విదిత రమ్య సత్య సూక్తి.

7. 'హరిగతి' రగడ - మధురగతి రగడకు రెట్టింపు
ఎనిమిది నాలుగు మాత్రాగణాలు 3,5,7 వగణాద్యక్షరం యతి

ఉదా:-

జయజయ - కలశీ, సుతగిరి కన్యా, - శైవలి, నితట కల్పన, హీరుహ
జయజయ, దక్షిణ, శశిశ, శశిధర - సంయమి, సేవిత, పాదన, రోరుహ

8. (వి)జయభద్ర రగడ - ద్విరదగతి రగడకు రెట్టింపు - ఎనిమిది పంచ మాత్రాగణాలు; 3,5,7వ గణాద్యక్షరాలు యతి.

ఉదా:-

(1) దారిద్ర్య,శక్యన ధరా-ధరకోణ, ఘనశిలా-త విశద్ది, శాపరి-
స్తరణ ర,మ్యంబైన

(2) దారిమ,ధ్యనభూ - ధర ఝరి, సారణి
దరనీల, పదిలఘూ - త్త మశాలి, మృదువైన

9 వృషభగతి రగడ :- హరిణగతిరగడ రెట్టింపు నాలుగు మిశ్రగతి గణాలు (సప్తమాత్రా గణాలు నాలుగు). తృతీయ గణాద్యక్షరం యతి.

(1) బాల బాలర పాల మిడిపిక - పాలి పాలిటి యదుర సాలము
గేలి గేలిడి గ్రుచ్చగదురా - గిల్లు గిల్లుము తత్ర్పవాలము

ఉదా:-

కొమ్మ - వేగిర మేటి - కే కొన - గోర - గోరట, విరులు - గిల్లుము
తమ్మి - పువ్వుల, మీద - జలములు - దార - దారక, యుండ-జల్లుము

రగడలు కూడా ద్విపదలవలె రెండు పాదాలు కలిసి ఒక రగడ అవుతాయి. ద్విపదలలో వలెనే వరసగా ఎన్ని పాదాలనైనా చెప్పవచ్చు

సరి సంఖ్యలో పాదాలుండటం రగడల సంప్రదాయం. ఒకే పదం ఉభయ పదాలలో ఉండగూడదని నిషేధం. కవులీ నిషేధాన్ని పాటించలేదు పై రగడల లక్షణాన్ని పరిశీలిస్తే గమనించవలసిన ఒకటి, రెండు విశేషాంశాలు గోచరిస్తాయి. సమాన మాత్రా సంఖ్యగల గణాలు సమసంఖ్యలో (నాలుగు, 8,2) ఉండటం రగడల సామాన్య లక్షణం. కాని హరిణగతి రగడలో మాత్రం సప్తమాత్రా గణాలు రెండే ఉంటాయి. వృషభగతి రగడలో సప్త మాత్రా గణాలు నాలుగుంటాయి ఈ దృష్టితో చూస్తే వృషభగతి రగడే పూర్ణరగడ అని, హరిణగతి రగడ వృషభగతిరగడకు అర్ధ రగడ అని అనిపిస్తుంది. కాని హరిణగతి రగడలో కూడా సప్త మాత్రా గణాలు రెండే అయినప్పటికీ మూడు, నాలుగు మాత్రల గణాలు కలిసి నాలుగు ఉంటాయి. కాని అవి సమాన మాత్రా సంఖ్యా గణాలు కావు. మిశ్ర గణాలు, రగడల యతి విషయంలో కూడా గమనించ వలసిన విషయం ఒకటి ఉన్నది. నాలుగు గణాలు గల ప్రధాన రగడలలో యతి సరిగ్గా పాదమధ్యంలో ఉంటుంది. సామాన్యంగా పాద మధ్యంలో యతి ఉండటం గేయానికున్న సహజ లక్షణం. పాద మధ్యంలోని యతి గేయగతిని పెంపొందిస్తుంది. కాని రగడలకు అద్యంత్య ప్రాసలు చెప్పడం వల్ల ఆ నియమం రగడల గేయగతిని మందీకరిస్తుంది. అది ప్రాస పద్య లక్షణం. పాఠ్యానుకూలమైనది. ఈ రహస్యాన్ని గుర్తించిన కవులు రగడలలో అద్యంత్య ప్రాసలను ఐచ్ఛికంగానే వాడినారు. కొందరు కవులు రగడల గతులనుబట్టి కాక పాదమాత్రా సంఖ్యనుబట్టి రచించినారు.

## షట్పదులు

ప్రాచీన తెలుగు సాహిత్యంలో షట్పదులకు ప్రయోగం దాదాపు లేదనే చెప్పాలి షట్పదులు రగడల వలెనే త్ర్యస్రాది గతులలో నడిచే రచనలే. పాద నిర్మాణంలో తప్ప రగడలకు, షట్పదులకు పెద్ద తేడా లేదు. ఈ కారణం వల్లనే నవవిధ రగడలకు లక్షణం చెప్పిన తెలుగు లాక్షణికులకు షట్పదులకు లక్షణం చెప్పవలసిన అవసర మేర్పడలేదు.

జానపద వాఙ్మయంలో కొన్ని షట్పదులకు ప్రయోగాలు (లక్ష్యాలు) కనిపిస్తున్నాయి. ప్రాస నియమం ఉంటుంది యతి నియమం లేదు.

భోగ షట్పది :— 3 + 3 + 3 + 3
3 + 3 + 3 + 3
3 + 3 + 3 + 3 + 3 + 3 + 2 (గ)

ఉదా:— తులసి – యింట – నుంచు – వార్కి
తులసి – పూజ – చేయు – వార్కి
తులసి – యందు – భక్తి – యుంచి – మెలగు – వారి – నీ
తులసి – జూచి – మ్రొక్కు – వార్కి
తులసి – యనుభ – వించు – వార్కి
తెలసి – నీవు – వారి – దిక్కు – తొంగి – చూడ – కూ.

శరషట్పది :— 4 + 4
4 + 4
4 + 4 + 4 + 2 (గ)

మరో ప్ర – పంచం
మరో ప్ర – పంచం
మరో ప్ర – పంచం – పిలిచిం – ది (డి)
పదండి – ముందుకు
పదండి – త్రోసుకు
పోదాం – పోదాం – పైపై – కి (కి)

(శ్రీ. శ్రీ; మహాప్రస్థానం)

కుసుమ షట్పది :— 5 + 5
5 + 5
5 + 5 + 5 + 2 (గ)



(1) "ఈశ్వరా – పుత్రునకు
గాజావ – తారునకు
పార్వతి – తనయునకు – భక్తి తో – నూ"

(2) చెంగావి – చీరెలా
కొంగూలు – జీరాడ
రంగైన – నవమోహా – నాంగి ఎ – క్కడికే
చంద్రూని – శిరమూన
ధరియించు – కొన్నట్టి
జగము లే – లెడు జగా – ధీశు న – న్నిధికే.

కామినీ షట్పది .— 3+4+3+4
3+4+3+4
3+4+3+4+3+4+2 (గ)

ఉదా:— గుమ్మ – దేదే – గోపి – దేవి
గుమ్మ – దేదే – కన్న – తల్లి
గుమ్మ – డివి పొడ – సూపగదవే – అమ్మ – గోపె–మ్మా
ప్రమ్చు – తనమున – వేద – ములుగొని
తెచ్చి – చెలచెదు – జలధి – లోపల
జొచ్చి – యున్న – వాని – వెంబడి – జొచ్చి – జలనిధి లో

తెలుగులో ఈ నాలుగు షట్పదులే ప్రముఖంగా కనిపిస్తున్నాయి. మిగతా వాటికి జానపద గేయ వాఙ్మయంలో కూడా ఉదాహరణలు కనిపించడం లేదు. ఆధునిక కవులు కొందరు షట్పదులలో రచనలు చేసిన వారున్నారు, (శ్రీ. శ్రీ., పుట్టపర్తి నారాయణాచార్యులు, చిలుకూరి నారాయణరావు.,

## గేయ ఛందస్సులు - పరిణామం

ఏ దేశంలో నైనా, ఏ భాషలో నైనా గద్య సాహిత్యానికి పూర్వం పద్య సాహిత్యము, ఆ పద్య సాహిత్యానికి తొలిమెట్టుగా గేయ సాహిత్యము వృద్ధి పొందినాయి. అనేక గేయ ఛందస్సుల నుంచే పద్య ఛందస్సులు పరిణమించినాయని పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు. లక్షణ కర్తలు జాతులు, ఉపజాతులుగా పేర్కొన్నవి ఈ గేయ సాహిత్యం నుంచి పరిణమించినవే, సంస్కృతంలోని మాత్రాగణాల పద్ధతి ప్రకారం తెలుగులో మాత్రా గణాలను ఏర్పరచడంవల్ల, అట్టి పద్ధతికి ఇమిడిన వాటికి మాత్రమే లక్షణ గ్రంథాలలో స్థానం లభించింది గురువుల ప్రస్తారం వల్ల ఏర్పడిన గణాలలో లఘ్వాదుల ముందు మరొక లఘువు చేర్చి మాత్రా గణాలను చెప్పడం జరిగింది. ఆ విధంగా సూర్య - ఇంద్ర — చంద్ర గణాలు ఏర్పడినాయి. ఇట్లా ప్రస్తారం వల్ల వచ్చిన గణాలనే స్వీకరించడం వల్ల మాత్రా సంఖ్యకు కాక ఆయా మాత్రా సూచకాలుగా ఉండే గురు లఘువుల క్రమానికి ప్రాధాన్యం వచ్చింది దీనివల్ల కొన్ని దేశీయ రచనలు మాత్రమే లక్షణవంతాలై, అనేకాలు అనాదృతాలైనవి సూర్యేంద్ర చంద్ర గణాలకు బదులుగా, మూడు, నాల్గు, అయిదు, ఏడు, తొమ్మిది మాత్రలు గల గణాలను స్వీకరించాలి. ఇటువంటి గణాలతో దేశీయ రచనలలో పాదా లేర్పడతాయని చెపితే అనేక రచనలకు లక్షణం కుదర వచ్చును. ఉదాహరణకు మూడింద్ర గణాలు, ఒక సూర్య గణము ద్వి పద పాదానికి లక్షణంగా చెప్పడం వల్ల కొన్ని విధాలైన రచనలను మాత్రమే సమీకరించినట్లయినది పై లక్షణాన్ని బట్టి చూస్తే

అల్ల వూ — రివారు — పిల్లనడి — గేరు
పిల్లవా — నికి రూపు - రేఖలు — న్నాయి

అనేది ద్విపద కాకపోవలసి వచ్చును. అట్లాగే మరో ఉదాహరణ

నలల

చిట్టి నా అబ్బాయి — చిరుమొగము — జూచి
సిగ్గుపడి - చంద్రుడు - పొడవ జా - లాడు.

మొదటి పాదంలోని మూడవ గణము 'భల'ము. 'భ' గణం మాత్రమే ఇంద్ర గణము 'భల'ము కాదు 'భల'మును మాత్రలను బట్టి చూస్తే అయిదు. ఐదు మాత్రల దృష్ట్యా చూస్తే భలమింద్ర గణమవుతుంది. మాత్రా సంఖ్య కాక గణమందుండ వలసిన అక్షర క్రమము నియతం చేయడం వల్ల భల మింద్ర గణం కాలేదు. మాత్రా సంఖ్యను చెప్పడమే దేశీయ రచనలకు అనువుగా ఉంటుంది గాని, ప్రస్తారంవల్ల ఏర్పడిన గణాలను పేర్కొనడం సరియైన పద్ధతి కాదు

ద్విపద అనేక దేశి పద్య ఛందస్సులకు మూలమనవచ్చును ద్విపద పద (గేయ) ఛందస్సులు పద్య ఛందస్సులుగా మారే ప్రథమ దశను సూచిస్తుంది. ద్విపద గేయ ఛందస్సు. ద్విపదలో ఇంద్ర గణాలన్నీ చతుర్మాత్రా గణాలై, చివరి త్రిమాత్రా గణమైన అక్షరాన్ని ఒక మాత్రా కాలం సాగదీసి పాడితే చతురస్రగతిలో నడిచే హరిగతి రగడ అవుతుంది. నాలుగు మాత్రల గగం సగణాన్ని సూర్యగణంగా కవిజనాశ్రయకర్త పేర్కొన్నాడు. అట్లాగే ఇంద్ర గణాలన్నీ పంచ మాత్రా గణాలై, సూర్యగణం లోని చివరి అక్షరాన్ని రెండు మాత్రల కాలం సాగదీస్తే ఖండగతిలో నడిచే ద్విరదగతి రగడ అవుతుంది పాటల్లో పాదాంత లఘువును ఒకటి, రెండు మాత్రలు సాగదీసి పాడటం ఉన్నది. కనుక ద్విపద ద్విరదగతి రగడ, హరిగతిరగడ వంటి గేయ ఛందస్సుల నుంచి రూపొంది ఉండవచ్చుననిపిస్తుంది. ద్విరదగతి రగడ, హరిగతి రగడ నియమాలు సరళమైనవి. ద్విపద ఛందస్సు వీటికంటె క్లిష్టమైనది. మొదట నియమాలు సరళంగా ఉండి రానురాను క్లిష్టం కావడం ఛందః పరిణామానికి సహజం. ద్విపదల్లో చతుర్మాత్రా గణాలు; పంచమాత్రా గణాల కలగలుపు ఉండటానికి కూడా కారణాలున్నాయి లాక్షణికులు జానపద గేయాల గాన సంప్రదాయాన్ని సరిగా గుర్తించకపోవడం (లఘువును గురువుగా సాగదీసి, గురువును లఘువుగా చేసి పాడటం). వారి భాషను సంస్కరించడం తప్పుగా గణవిభజన చేయడం- ఇవీ కారణాలుగా కనిపిస్తున్నాయి. ఉదాహరణకు "అంతట రాములవారూ - అంగన సీతను గూడీ" ఇది చతురస్రగతిలో నడుస్తుంది. "అంతట రాముల వారు- అంగన సీతను గూడి" అని ఈ విధంగా భాషను సంస్కరించినందు వల్ల

త్రిమాత్రాగణాలైన సూర్యగణాలు మధ్యలోను, చివరలోను చేరి మధ్యాక్కర పద్యమైంది. కనుక ద్విపద గేయ ఛందస్సునుంచి పరిణమించిందని నిర్ధారణగా చెప్పవచ్చు. అట్లాగే సీసం (కుసుమషట్పది). కందం (హరిగతిరగడ) కుసుమషట్పది అయిన ఈ క్రింది ఉదాహరణను

శివభక్తుని కృతునకు గాజావ తాకనకు
పార్వతీ - శివయనకు - భక్తి - తోను (మా)

పైవిధంగా రాస్తే సీసపద్య పాదమవుతుంది. (చివరి దీర్ఘాన్ని హ్రస్వంగా చేయడం.) ఈ విధంగా జాత్యుపజాతులన్నీ ఒకప్పుడు గేయాలే. క్రమంగా అవి పద్యాలుగా పరిణమించినాయి. అట్లాగే వృత్తాలు కూడా.

*గేయగంధి వృత్తాలు* — అక్షరగణ ఛందస్సులైన వృత్తాలకు మగణాది గణాలైన త్రికాలతో లక్షణం చెప్పడం జరిగింది. ఆవిధంగా చెప్పడం వల్ల ఆ పద్యాల నడక పట్టుబడదని, త్ర్యస్రాది గతులతో లక్షణం చెప్పడం వల్ల ఆ పద్యాల నడక పట్టుబడుతుందని గిడుగు సీతాపతిగారు ప్రతిపాదించినారు.* లయ నిర్దిష్టంగా ఉండని వృత్తాలలో సహితం స్పష్టంగా త్ర్యస్రాది గతులతో నడిచే వృత్తాలనేకం. వాటిని గేయగంధి వృత్తాలనవచ్చు. ప్రతి వర్గానికి మచ్చుకు ఒకటి, రెండు ఉదాహరిస్తాను.

త్ర్యస్రగతి

1. పంచ చామరము :- జరజరజగ ..

ఉదా:- జరల్ | జరల్ | జగం | బుగా | డిస | ఎనిమిది'లగ'లతో
మ్నతిన్, | రచిం | పగా | ఈ వృత్తాన్ని
నడపవచ్చు.

---

*డా॥ గిడుగు సీతాపతి, తెలుగులో ఛందోరీతులు పుటలు 239&240

తరలి — భసనజనర—"గల+న+గల+న+గల+న+గల+గా"
ఈ విధంగా నడుస్తుంది.

ఉదా:- చారుభసన భూరి జన రసాంద్ర గణములన్ దిగా

చతురస్రగతి:- చంపకమాల, ఉత్పలమాలలు.

చంపకమాల :- నజభజజజర

4 8 4 4 8

ఉదా:- చిలుకల | కొల్కినీవలుకు | చిల్కల | పల్కుల | కంచెదీయనై |

ఉత్పలమాల :- భరనభభరవ

4 8 4 4 8

ఉదా:-చిల్కల | కొల్కినీవలుకు | చిల్కల | పల్కుల | కంచెదీయనై |

మిశ్రగతి :- మత్తకోకిల:- ర,స,జ,జ,భ,ర-

గల,భ,గల,భ,గల,భ,గల,గ (ర)అనే తీరులో నడిచే వృత్తమిది రెండు మాత్రలు తక్కువగా వృషభగతి దగ్గర అవుతుంది.

ఉదా:- ఎంతకాలము నీవు నాకము-నేలి తింతటి నుండి నా.

ఈ విధంగా వృత్తా లెన్నో గేయగతులకు దగ్గరగా తక్కువ చక్కని నడక ప్రస్ఫుటమయ్యే పద్యాలే ప్రాచుర్యం పొందాయి.

## గేయగంధి సామెతలు - పొడుపు కథలు

నలుగురు కూచొని కాలక్షేపానికి కబుర్లు చెప్పుకొంటుంటే సంభాషణలో ఏవో సామెతలు, పొడుపు కథలు దొర్లుతుంటాయి. అవి సహజంగా కుదురుకొన్న యతి ప్రాసలతో కూడుకొని ఏదో ఒక లయలో వెలువడుతుండటం సహజం. పరిశీలించాలేకాని అవి ఏదో ఒక ఛందంలో అందంగా ఒదిగి ఉంటాయి. తెలుగు భాషలో గేయగతిగల సామెతలు, పొడుపు కథలు కోకొల్లలుగా కనిపిస్తాయి. కొన్ని పూర్తిగా గేయాలైతే మరికొన్ని ఒకటి- రెండు మాత్రలు తక్కువగానో, ఎక్కువగానో గురికి బెత్తెడు దూరంగా త్ర్యస్రాది గతులలో నడుస్తాయి.

నానుడులలోను, సామెతలలోను గమనించవలసిన ముఖ్యవిషయం ఏమంటే మాత్రా ఛందస్సుకు కట్టుబడినంతవరకూ నానుడిగాని, సామెత గాని మారదు. తక్కిన భాగం మారుతూ ఉంటుంది. ఇది నియతికి, డిజైనుకు,

లయకు ఉన్న ఆకర్షణను తెలుపుతుంది. ఉదాహరణకు త్ర్యస్రగతిలో నడిచే ఒక సామెతను తీసుకొని పరిశీలిస్తాను. సౌలభ్యం కోసం పాద విభజన చేస్తాను.

1. బెండ | కాయ | ముదిరి | నా.
2. బ్రహ్మ | చారి | ముదిరి | నా.

3 4+3

3. పనికి | రాదు. లేదని పనికి | రాదంటారు.

పై సామెతలో 1,2 పాదాల డిజైన్, లయా సమానమే. త్ర్యస్ర గతిలో ఉంది. ఈ సామెతను ఎవరువాడినా "బెండకాయ ముదిరినా, బ్రహ్మచారి ముదిరినా" అన్నంత వరకు మార్పు ఉండదు. ఆ తర్వాత క్రియా పదంలోనే మార్పు ఉంటుంది. సామెతలలో క్రియాపదం మాత్రా ఛందస్సుకు కట్టుబడి ఉండకపోవచ్చు. మాత్రా ఛందస్సుకు కట్టుబడి ఉన్న సామెత భాగంలో మాత్రం ఎవరు వాడినా మార్పుఉండదు.

అల్లాగే తిశ్రగతిలో ఉన్న సామెతలు

1. ఇల్లు కట్టి చూడు - పెళ్ళి చేసిచూడు
2. తల్లికొచ్చి ముంత దాచడ మెందుకూ

చతురస్రగతి:- 1. ముందుకు పోతే నుయ్యి
వెనకకు పోతే గొయ్యి.
ఎరువుల సొమ్ములు బరువుకు చేటూ
తియ్యా పెట్టా తీపుల చేటూ
వాటిలో ఒక్కటి పోతే
అప్పుల చేటూ

ఖండగతి :- ముంజేతి - కంకణా — నికి అద్ద - మెందుకూ

మిశ్రగతి :- కోటి విద్యలు కూటికొరకే
కోరు నష్టం పొంతులాభం

ఎనిమిదిమాత్రలు:- 1. నీ చేతి మాత్ర - వైకుంఠయాత్ర
2. జిహ్వకో రుచి — పుర్రెకో బుద్ధి
3. గతి లేనమ్మకు - మతిలేని మొగుడు

కొన్ని సామెతల పాదాలన్నిటా సమానంగా మాత్రలుండటం వల్ల సమభారత (Balance) సమానంగా ఉంటుంది.

4 6 4
అంగడి | లోఅన్నీ | ఉన్నవి = 14
అల్లుడి | నోట్లోశని | ఉన్నది = 14

ఈ రెండు పాదాల స్వరూపంలో సామ్యం స్పష్టంగా కనిపిస్తూంది. అంగడి అల్లుడి చతురస్రగతిలో మొదలై, ఉన్నవి. ఉన్నది చతురస్రగతిలో అంతమవుతాయి. నడుమ ఆరుమాత్రల గణాలు ఉన్నాయి.

## గేయం పాట

గేయ మన్నా — పాట అన్నా ఒకటే. కాని సాంకేతికంగా కవిమి త్రార్థంలో వాడుతున్నారు. గేయంలో గతి ప్రధానం. కేవలం లయనను సరించి పాడుకోవడం గేయమవుతుంది. గేయంలో మాత్రలు సాధారణంగా నిండుగా ఉంటాయి. పాటలో విరామానికి జాగాలు ఉంటాయి. అధు నికులు రాస్తూన్న గేయాలలో ఏమాత్రం విరామానికి జాగా ఉండక, అఖం డంగా సాగిపోతాయి ఉదాహరణకు

ఇక్ష్వాకు | వంశపు | శీంద్రచంద్రు | డులకిరి
కౌముదులు | వల్గడల | కలయతిరి | షినవాడు.

ఇట్లా అఖండంగా నిర్విరామంగా సరిపెణవలె సాగిపోతుంది నడక. భావం ముగిసినప్పుడు కూడ విశ్రాంతికి చోటు లేదు. విశ్రాంతి తీసికొంటిమా తాళం పటాపంచలవుతుంది. కనుక ఇటువంటి గేయ రచనలలో ప్రధానం లయ మాత్రమే. మరొక ఉదాహరణద్వారా గేయానికి పాటకు ఉన్న

తేడాను విశదీకరిస్తాను. ఉదాహరణకు సుగ్రీవవిజయంలోని ఏలపాట

భాను వంశ మూన బుట్టి
దాన | వశా | మీవి | గొట్టి
పూని మఖము నిర్వహింప వా, ఓ రామచంద్ర
మౌని వరులు సమ్మతింపగా

పై ఏలలో మూడవ పాదం చివరి సంబోధన, మూడు, నాలుగు పాదాల చివరి గురువును తొలగిస్తే హయప్రచార రగడ అవుతుంది. సంబోధనలు లేకపోతే పైన పేర్కొన్న ఏలకు, రగడకు భేదమేమీ లేదు. మూడు, నాలుగు పాదాల చివరనున్న గురువు-సంబోధన చేర్చడంవల్ల కలిగిన ఊపు కొనసాగ ఏర్పడినట్లుగా తోస్తుంది. సంబోధనే ఏలకు ప్రత్యేకత.

పై ఏలపాట మాత్రాఛందస్సు దృష్ట్యా త్ర్యస్రగతిలో నడిచే హయప్రచార రగడే అయినా, పాటగా పాడుకొన్నప్పుడు చతురస్రగతిలోకి పోతుంది. పై ఏలను ఇట్లా పాడుతారు.

3 4 4 4
మొదటిపాదం:- భాను | వంశా | మూనా | బుట్టి
[illegible]

మొట్టమొదటి యూనిట్లో మాత్రం ఒక మాత్ర తక్కువగా ఉంటుంది. తాళంలో ఒక మాత్ర ఖాళీగా (విరామం) ఇచ్చి పాట ప్రారంభమవుతుంది. ఇది ఒక అందం. తక్కింది స్పష్టంగా 4 మాత్రల చొప్పున చతురస్ర గతిలో విరుగుతుంది.

అట్లాగే

3 4 4 4
రెండోపాదం : దాన వాశా మీవి గొట్టి

3 4 4 4

మూడో పాదం : పూని మఖమూ నిర్వా హింపా

తర్వాత 'వా' మిగిలింది 'వా' తో కలిసి '. రామచంద్రా' అనేది మరోపాదం అవుతుంది అప్పుడు నాలుగోపాదం

3 2+2 4 4

ఇట్లా ఉంటుంది: - 'వా' .... రామా చంద్రా

3 4 4 4

ఐదోపాదం : పూని వరులూ సమ్మా నింపా

"గా" మిగిలిపోతుంది దీనితో కూడా "వా" తర్వాతిలాగే '. రామ చంద్రా' అని పూర్తి చేస్తారు. లేదా తాళం పూర్తి అయ్యేవరకు దీర్ఘం తీస్తారు. ఈవిధంగా త్రిశ్రగతిలో నాలుగు పాదాలుగా ఉన్న ఏం పాటగా పాడుకొన్నప్పుడు చతురస్రగతిలో విరిగి ఆరు పాదాల క్రింద పరిణ మిస్తుంది.

ఈ విధంగా మాత్రలను సాగదీసి పాడటమే కాక, మాత్రం పరిమా ణాన్ని కుదించి కూడా పాడే పాటలు ఉన్నాయి.

6 4 6 6

వట్టివలపు - చల్లకు - విష్ణుమూర్తి - లీ నీవు -

6 6 6 2

కొట్టిదీర - మాటలాడు - విష్ణుమూర్తి - లీ -

దీని అక్కడ ఉన్న అక్షరాలను బట్టి మాత్రాసంఖ్యను చెప్పితే 6-4-6-6-6-6-6-2 అని చెప్పాలి కాని ఈ పాట 'కిటతక' అనే నాల్గు మాత్రల కాలంలోనే ఒక్కొక్క అవృత్తి కుదించి పాడతారు. ఈ ఎని మిదింటిలో నిజానికి నాల్గు మాత్రలు కలది రెండవ అవృత్తి (చల్లకు) మాత్రమే. చివరిది రెండు మాత్రలది. మిగిలినవన్నీ ఆరుమాత్రలవి. ఈ భేదాలున్నా ఇవన్నీ – ఆరుమాత్రలది కుదించి, రెండు మాత్రలది పెంచి - చతుర్మాత్రా కాలంలోనే - కిటతక' పద్ధతిలోనే - పాడతారు, అందువల్ల ఈ పాటలోని అవృత్తులన్నీ సమమాత్ర కాతే అవుతున్నాయి.

## మాత్రా ఛందస్సు - ప్రయోగాలు

ఆధునిక కవులు ఛందస్సులో అపూర్వమైన ప్రయోగాలు చేసినారు. ఇంతటి ఛందో వైవిధ్యం ఇంతకు ముందెప్పుడూ అగుపించదు. ప్రాచీనాంధ్ర కవులు ప్రవహితమైన మార్గంలో పయనించి, ప్రౌఢ గమనం ప్రదర్శించిన వారేకాని, ఇంచుకంత భిన్నమార్గం తొక్కినవారు కారు 'ర-ల'లకు మైత్రి ఘటించినంత మాత్రాన మహాకవి బంధి నుంచి వెలికి గురి అయిన కాలంలో ఛందస్సు మొదలైనవాటిలో ప్రయోగాలకు అవకాశం ఎక్కడిది ? నలిగిన బాటలో ఏమాత్రం వలగకుండా ప్రయాణించడంలో సుఖం, భద్రత రెండూ ఉన్నాయి. కొత్తదారి వేయడానికి, కొండంత సాహసం, సంయమనం కావాలి. గురజాడ అప్పారావు కవిత్వాన్ని పద్యం నుంచి గేయంవైపు మలుపు తిప్పడంలో అపూర్వమైన సాహసాన్ని కనబరచినాడు. నిరలంకారమైన రీతిలో, వాడుకభాషలో కవిత్వాన్ని చెప్పడంలో అవధిలేని సంయమనం వ్యక్తమైంది.

ఆధునిక కవులు పద్యసాదృశ్యాన్ని పురస్కరించుకొని గేయాలలో కూడా చాలా వరకు నాలుగు పాదాల నియతిని పాటించినారు. మొదట గురజాడ అప్పారావే మిశ్రగతిలో నడిచే ముత్యాల సరాన్ని నాలుగు పాదాలుగా రచించడంతో, గేయం విషయంలో గురజాడను అనుసరించిన భావకవులు మిగతా గతులలో కూడా నాలుగు పాదాల నొక ఖండంగా రచిస్తూ వచ్చినారు పాద నియతిని పాటించని గేయాలను కూడా రచించినారు. ముఖ్యంగా అభ్యుదయ కవులు పాద నియతిని పాటించలేదు గతిని మాత్రమే దృష్టిలో పెట్టుకొని Run-on పద్ధతిలో పాదాలకు పాదాలు రాసుకొంటూ పోయినారు. ఆధునిక కవులు రగడ ఛందస్సులనే మార్చి మార్చి ప్రయోగించినారు. లాక్షణికులు నిర్దేశించిన గణాలే కాక, ఇతర గణాలను కూడా వాడి, కొన్నిచోట్ల యతి, ప్రాస, అంత్యప్రాస నియమాలను పాటించక, మరికొన్ని చోట్ల పాటించి అనేక విధాలుగా ప్రయోగించినారు. రగడలలో పాదానికి నాలుగు గణాలు కాని

ఎనిమిది గణాలు గాని ఉంటాయి. భావకవులు గణ సంఖ్యా విషయంలో స్వేచ్ఛ నవలంబించినారు. గణాలు పెంచో, తగ్గించో వ్రాయడమే కాక, గణాల మీద ఒకటి రెండు మాత్రలు పెంచో, తగ్గించో రచించినారు.

ఆధునిక కవులు త్ర్యస్ర, చతురస్ర గతులలో కంటె ఖండ మిశ్ర గతులలో ఎక్కువగా గేయాలు రచించినారు. ఆధునిక కవులు వివిధ గతులలో చేసిన ప్రయోగాలు మచ్చుకు గతికి కొన్నిటి చొప్పున తీసుకొని పరిశీలిస్తాను

*1. త్ర్యస్రగతి:* త్రిమాత్రా గణాల ఆవృత్తిలో నడిచే గతిని త్ర్యస్ర గతి అంటారు. అన్నీ త్రిమాత్రా గణాలే వాడుతూ హయ ప్రచార రగడ లక్షణాన్ని పాటించిన ప్రయోగం.

రక్త నాళ ముక్త ధార
కత్తు లూరి పొంగి పారి
రక్త రాగ రంజి తమ్ము
దిక్త టమ్ము వెంట పిరి

హయ ప్రచార రగడలో 'లగ' ప్రయోగం నిషేధం - ఇక్కడ 'లగా'న్నే కాక నగణాన్ని కూడా వాడలేదు. అంతటా 'గల' ప్రయోగమే కనిపిస్తుంది. ఏకగణావృత్తి వల్ల నిర్దిష్ట గమనం ఉన్నది. అన్ని పాదాలకు ప్రాసను పాటించడం జరిగింది. మొదటి పాదంలో ప్రాస యతిని, మూడో పాదంలో యతిని, మూడు పాదాలలో మొదటి అక్షరాలకు స్వరమైత్రిని పాటించడం జరిగింది. మొదటి రెండు పాదాలలో అంత్యప్రాస నియమ మున్నదని చెప్పడంకంటె సరి పాదాలలో అంత్యప్రాస నియమ మున్నదని చెప్పడం సమంజసం. కనుక రెండు పాదాలను ఏక పాదంగా వ్రాస్తే అప్పుడది తురగవల్గనరగడ అవుతుంది. యతి ప్రాసల నియమాన్ని పరిశీలించకపోతే పై ఉదాహరణ హయ ప్రచార రగడ (పూర్ణ రగడ) అవుతుంది.

హాయ ప్రచార రగడలో పాదానికి పన్నెండు మాత్రలుంటాయి కేవలం మాత్రా సంఖ్య నియమం మాత్రమే పాటించి వివిధ గణాలను ప్రయోగిస్తూ విభిన్న గతులు కల్పించిన గేయాలే ఎక్కువగా ఉన్నాయి.

ఉదాహరణకు :

| | | | |
|---|---|---|---|
| (1) | నరలోకపు చెరసాలకు | = | 6 + 6 |
| (2) | నలువైపుల కటకటాలు | = | 6 + 6 |
| (3) | జననం మరణం మధ్య | = | 4 + 4 + 4 |
| (4) | సాగే యాత్ర స్థానం | = | 4 + 4 + 4 |
| (5) | దూరమెంత ? భారమెంత | = | 3 + 3 + 3 + 3 |

మొదటి రెండు పాదాల్లో రెండు షణ్మాత్రా గణాలను వాడటం జరిగింది. చతురశ్రగతిలో కూడా విభజించవచ్చు కాని కవి ఉద్దేశించింది షణ్మాత్రాగణాలే. 3,4 పాదాలు చతురశ్రగతిలో నడుస్తాయి. ఐదో పాదం ఒక్కటే త్రిశ్రగతిలో నడుస్తుంది. అయితే అన్ని పాదాలలోను నియతంగా పన్నెండు మాత్రలే ఉన్నాయి. మాత్రానియతిని పాటిస్తూ, పాదనియతిని పాటించకుండా రచించిన గేయమిది.

3. ఈ విధంగా మాత్రా సంఖ్య నియమాన్నిపాటిస్తూ అక్కడక్కడ పాదాంతంలో ఒకటి రెండు మాత్రలు పెంచి రచించిన గేయాలుకూడా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| (1) | వినరావే విభావరి | = | 6 + 6 |
| (2) | వేలా కాలం నిమ్మది | = | 4 + 4 + 4 |

(5)

(3) వసనాం చలముల గుసగుస లో = 4+4+4+2
(4) మసలు చరణ మంజీరము = 3+3+6
(5) కొసరు జాలి పలుక రింత లో = 3+3+3+3+2

(కృష్ణరాత్రి :- కృష్ణరాత్రి కృతులు)

మొదటి పాదం ఆరు మాత్రలకు విరుగుతుంది. 2,3 పాదాలు చతురస్రగతిలో నడుస్తాయి. నాలుగో పాదంలో రెండు త్రిమాత్రా గణాలు, ఒక షణ్మాత్రాగణం ఉన్నాయి. ఐదో పాదంలో అన్నీ త్రిమాత్రాగణాలే ఉన్నాయి. మూడోపాదం, ఐదోపాదం చివర 'లో' అనే గురువును అధికంగా ప్రయోగించడంతో విచిత్రమైన తూగు వచ్చింది. అయినా మొత్తం గేయం నడకను బట్టి ఇది త్ర్యస్రగతిలో రచించిన గేయంగానే పేర్కొనాలి.

4. నాలుగు పాదాల నియతిని పాటించిన గేయఖండంలో పాదాద్యక్షరంలో ఒక అధిక మాత్రను ఉపయోగించి రచించిన గేయాలలో ఒకదానిని పేర్కొంటాను.

"ఏ నా | టి దీ | రాగ సిక్త
భావ ముగ్ధ జీవ నమ్ము -

పై ఉదాహరణలో 'ఏనాటిదీ' అనే పదంలో 'ఏనా' మొదట నాలుగు మాత్రలు ఉన్నాయి. మొదటి దీర్ఘాన్ని (ఏ) ను కుదించి హ్రస్వంగా ఉచ్చరించి గబాలున 'నా' ను అందుకోవాలి. అప్పుడు ప్రథమ పాదం లయ కుదిరి గేయ మంతా త్ర్యస్రగతిలో నడుస్తుంది.

5. ఒకే పాదంలో మొదట, చివర దీర్ఘాక్షరాలు ప్రయోగించి చక్కని నడకను సాధించిన గేయాలు కూడా ఉన్నాయి.

1. "వా. విదుర జీవితాన
ఈ. మధుర భావగాన
మే. లోక వాసి యూర్పునించె నో.
ఏ. వేకు వందు విల్పు పంచె నో."

పై ఉదాహరణలో మొదటి రెండు పాదాలలో మొదట అధిక గురువులను, తర్వాత రెండు పాదాలలో మొదటా, చివరా గురువులను ప్రయోగించడం జరిగింది. అయితే అధిక గురువులున్నందువల్ల త్ర్యస్ర గతిలో చిత్రమైన నడక వచ్చింది. ఖండగతి స్ఫురిస్తుంది. కాని పాదాదిలో ఉన్న గురువులను, అట్లాగే చివరి రెండు పాదాల చివర ఉన్న గురువులను ఒక మాత్రాకాలం సాగదీస్తే త్రిశ్ర గతిలో వస్తుంది. స్వరప్లుతి వల్ల గేయ గమనం హాయిగా పోతుంది. ఈ దీర్ఘా క్షరాలను విడిచి గేయ నిర్మాణాన్ని పరిశీలిస్తే నాలుగు త్రిమాత్రా గణాలు కనిపిస్తాయి. ప్రాస, అంత్యప్రాస నియమాలుకూడా ఉన్నందు వల్ల పై రెండు పాదాలను త్రిగణ హాయ ప్రచార రగడగాను, తర్వాతి రెండు పాదాలను పూర్ణ హాయ ప్రచార రగడగాను పేర్కొనవచ్చు. మొదటి రెండు పాదాలలోని గురువులను ప్లుతాలుగా సాగదీసినప్పుడు నాలుగు త్రిమాత్రా గణాల పాదమయి హాయ ప్రచార రగడ అవుతుంది.

భావ కవులు కేవలం మాత్రా సమత్వం వల్లనే గేయాలను హాయిగా త్రుతి చేయడంగా నడుపలేదు. అందుకు గేయ నిర్మాణంలో మరెన్నో సామ్యాలను పాటించినారు. పై గేయంలో ప్రతి రెండు పాదాం లోను నిర్మాణ సామ్యం కనిపిస్తుంది. మాత్రా సమత్వంతో పాటు అక్షర సమత్వం కూడా ఉన్నది. ప్రతి రెండు పాదాలలోను గురు లఘువుల క్రమం ఒక్కటిగానే ఉన్నది. పై రెండు పాదాలు ఉప వాక్యాలు. చివరి రెండు పాదాలు వాక్యాలు. ఏక కాలిక క్రియలతో అంతమవుతున్నాయి. పైగా

అవి రెండూ ప్రశ్నార్థకాలు పాదారంభాలు కూడా ప్రశ్నార్థకాలతో మొదలవుతాయి. అంత్య ప్రాస నియతి కూడా ఉన్నది. ధ్వని సామ్యం (Phonetic Similarity) తో పాటు వ్యాకరణ సామ్యం (Grammatical Similarity) కూడా పాటించి నందువల్ల ఈ గేయంలో చక్కని తూకం, తూగూ ఉన్నాయి. అందువల్ల గేయం హాయిగా సాగిపోతుంది.

6. త్ర్యస్రగతిలో ముత్యాలసరంలోలాగా నాలుగో పాదంలో మాత్రలు తగ్గించి చేసిన ప్రయోగాలు కూడా ఉన్నాయి. బసవరాజు అప్పారావు దీనిని 'పగడాల దండ' అని పేరు పెట్టినారట.

"చిన్నవోయె ముద్దు మోము
కన్ను లంట నీరు గారు
వన్నె తిరిగి వాడె మేను
కన్నె యేలనే" – (బసవరాజు అప్పారావు గీతాలు)

పై ఉదాహరణలో అర్ధపాదం మీద గురువును అధికంగా ప్రయోగించడం జరిగింది. ముత్యాల సరంలోకూడా అర్ధపాదం మీద గురువు (2 మాత్రలు) ఉన్న గేయమే ప్రచారంలోకి వచ్చింది. కనుక ఇది పూర్తిగా ముత్యాల సరం ప్రయోగాన్ని అనుసరించి చేసిన ప్రయోగం.

7. నాలుగు త్రిమాత్రాగణాలను మించి అధిక గణాలతో (ఎనిమిది గణాలకు తక్కువగా), అధిక మాత్రలతో రచించిన గేయాలు కూడా ఉన్నాయి.

మినుకు మినుకు చుక్క వోటిమింట దోచెను
కనక కాంతి నెల్ల దిశల బలుకరించెను

అంతు లేని ఆకసమ్ము ఆవరించెను
సంతసమ్ముతోడ తారసఖ్యమొసగెను" —

పై గేయంలో ఆరు త్రిమాత్రా గణాల తర్వాత ఒక అధిక మాత్రను నాలుగు పాదాలలోను సమానంగా ప్రయోగించడం జరిగింది. ప్రతి రెండు పాదాలకు ప్రాస – అంత్యప్రాస నియతంగా పాటించడం జరిగింది. ఇది తురగ వల్గన రగడలో ఐదు మాత్రలు తగ్గించి చేసిన రచనగా కనిపిస్తున్నది ఎందుకంటే యతిని కూడా తురగ వల్గన రగడలో లాగా నాలుగు త్రిమాత్రాగణాల తర్వాతి అక్షరంతో చెల్లించడం జరిగింది.

8. పూర్తిగా ఎనిమిది త్రిమాత్రా గణాలతో రచించిన గేయాలు కూడా ఉన్నాయి. ఎనిమిది త్రిమాత్రా గణాలపాదాలు, ఆ తర్వాత నాలుగు త్రిమాత్రా గణాల పాదాల కలయికతో కృష్ణశాస్త్రి త్ర్యస్రగతిలో చక్కని ప్రయోగం చేసినాడు.

3 6 8

'ఎవర | ని ఈరేయి | నిదుర | హృదయ, మదర, వేయి, చేయి,

6 8

చాయలాడ, పెను చీకటి, సైగ, అలో, నా కన్నుల రక్తమురల

లాగికొందురు.'' (కృష్ణశాస్త్రి:- కృష్ణశాస్త్రి కృతులు)

పై ఉదాహరణలో పై రెండు పాదాలు ప్రాస—అంత్యప్రాస నియమంలేని తురగ వల్గన రగడ యతిని నాలుగు త్రిమాత్రా గణాల తర్వాత పాటించడం జరిగింది. పై గేయంలో పాద దైర్ఘ్యం వల్ల గేయ గమనానికి కొత్తదనం రావడమేకాకుండా, భావానికి కూడా ఒక గాంభీర్యం వచ్చింది. ఈ గేయం గతి ఆగి ఆగి, లాగి లాగి సాగదీసినట్లుంటుంది. పెను చీకటి రేయి ఎంత దీర్ఘమైనదో ధ్వనింప జేసినాడు కవి.

9. త్ర్యస్రగతిలో పొడవైన పాదాలు రచించి గమన వైవిధ్యం కలిగించినట్లు గానే, చిట్టి పొట్టి పాదాలతో గేయగతిని చిందులు తొక్కించినారు. పాదానికి రెండేసి త్రిమాత్రా గణాలతో గేయాలెన్నింటినో రచించినారు. అడవి బాపిరాజు 'మెట్లు' అనే గేయం లయ దృష్ట్యా చక్కని ప్రయోగం.

మెట్లు, మెట్లు
రాతి, మెట్లు
కారు, నల్ల
రా తి మె ట్లు
— — —
— — —
చిన్న అడుగు
కన్నె అడుగు
– – – –
— — —
పాపి పదం
పరమ పదం
యుగాయుగాల పదములతో
రకరకాల అడుగులతో
అరిగి, అరిగి
తరిగి, తరిగి
– – – – – – – –
– – – – – – – –
ఎగసి, ఎగసి

ఏ పథాల చేర్చునవో

— — —

— — — —

(బాపిరాజు:- వైతాళికులు)

ఈ విధంగా రెండు త్రిమాత్రా గణాలతో గేయమంతా రచించి, అక్కడక్కడా నాలుగు త్రిమాత్రా గణాల దీర్ఘపాదాలను రచించి, అక్కడక్కడా ఒక పొట్టి పాదం (6 మాత్రలు) ఒక పొడుగు పాదం (12 మాత్రలు) వెంటనే రచించి గేయగమనంలో చక్కని వేగాన్ని సాధించినారు. ఈ గేయంలో పాదానికి రెండు త్రిమాత్రా గణాలు వాడటం జరిగింది, త్రిమాత్రా గణాలు మొత్తం మూడు (గల, లగ, నగణం). ఈ మూడు గణాలలో ఎన్ని రకాల కలయిక (Combination)కు వీలుందో అన్ని రకాలుగా కలయికను మార్చి మార్చి ప్రయోగించడం జరిగింది. మొదట కొన్ని పాదాలు అన్నీ గలలే (మెట్లు, మెట్లు). కొన్ని పాదాలు గల+నగణం (చిన్న అడుగు). కొన్ని పాదాలు గల+లగ (పాపి పదం), కొన్ని పాదాలు నగణం+లగ (యుగయుగాల). కొన్ని పాదాలు రెండూ నగణాలే (ఎగసి ఎగసి). ఈ విధంగా పాదాలలో గణాలు పేరుస్తూ, మారుస్తూ నడకలో చక్కని వైచిత్ర్యాన్ని సాధించడం జరిగింది. దీర్ఘ పాదాల చివర దీర్ఘాక్షరాన్ని అందులో 'ఓ' స్వరం వాడటం వల్ల నడకకు మంచి ఊపు వచ్చింది.

10. మాత్రాఛందః ప్రయోగంలో శ్రీశ్రీ ప్రత్యేకతను పట్టి ఇచ్చే ప్రధాన గుణం విలోమ గణాల ప్రయోగాధిక్యం. త్రిమాత్రా గణాలు వాడ వలసిన చోట 'లగ'ను, చతుర్మాత్రాగణాలు వాడవలసిన చోట జగణాన్ని అధికంగా వాడి గేయగమనానికి ఓజస్సును, తేజస్సును తెచ్చినాడు. త్రిశ్రగతిలో 'లగ' ప్రయోగాధిక్యం :-

లెనిన్ కథా క్రమం సదా 12

జపిం. చితిని నేను 9

విషాదాశ్రు తుషారాల 12
విషాదాకు లేదు 9

(శ్రీ శ్రీ. ఖడ్గసృష్టి)

మొదటి రెండు పాదాలలో వరసగా ఐదు 'లగ' లను ప్రయోగించి, చివరి రెండు పాదాలలో, 'లగ', 'గల' లను ఒకదాని తర్వాత ఒకటి ప్రయోగించి గమన వైచిత్రిని సాధించినాడు.

11. అర్థ పాదాలలో అక్కడక్కడా పాదం చివర ఒకటి రెండు మాత్రలు పెంచి చేసిన ప్రయోగాలు కూడా ఉన్నాయి.

(1) స్మృతి లోకం = 8 (2+4)
(2) తలుపు తెరవకే = 8 (3+5 or 3+8+2)
(8) చిరి మంటలు = 6 (2+4)
(4) పైకి పర్వునే = 8 (8+5 or 3+8+2)

పై గేయంలో బేసి పాదాల (1,3) నిర్మాణం, సరిపాదాల (2,4) నిర్మాణం ఒకే విధంగా ఉన్నాయి బేసి పాదాలలో ఆరుమాత్రలు ఉన్నాయి అవి 2+4 గా విరుగుతున్నాయి. బేసి పాదాలలో ప్రాసను పాటించడం జరిగింది. సరి పాదాలు, రెండిటిలో కూడా మూడు మాత్రలకు విరుగుతూ చివర అధిక గురువు ఉన్నది చివర ఉన్న అధిక గురువులో కూడా స్వరసామ్యం (ఎ) ఉన్నది. మొదటి రెండు పాదాలు కలిసి ఒక వాక్యం. తర్వాతి రెండు పాదాలు కలిసి ఒక వాక్యం. మొదటిది విధ్యర్థకం. రెండవది భవిష్యదర్థకం. ఇన్ని సామ్యాలు పాటించినందు వల్ల ఈ గేయం చాలా చక్కగా నడిచింది

ఈ విధంగా త్ర్యస్రగతిలో మాత్రలు పెంచడం, తగ్గించడం ప్రయోగదృష్ట్యా నడకదృష్ట్యా చేస్తే ప్రయోజనం దృష్టితో కూడా చేసినవారున్నారు. ఉదాహరణకు సి నారాయణరెడ్డి కర్పూర వసంత రాయలు కావ్యంలో —

"నేల నిదుర పోయె
నింగి నిదుర పోయె

గాలి నిదుర పోయె రేడా

కంటె అదిరి పోయె

(సి. నారాయణరెడ్డి; కర్పూర వసంత రాయలు)

విరహవేదనా మగ్నమానసుడైన రాయని (రాజు) హృదయ స్థితిని చిత్రీకరించే సన్నివేశంలోనిది ఈ గేయఖండం. ఈ గేయఖండంలో మూడు పాదాలు నవమాత్రా ప్రమాణంలో త్రిస్రగతిలో నడుస్తాయి. మూడో పాదం మాత్రం త్రిస్రగతిలోనే ఉన్నా, పన్నెండు మాత్రల ప్రమాణం ఉన్నది. నేలా, నింగీ చివరికి గాలి సైతం నిదుర పోయినా ఈ విశ్వంలో నిదురపోని జీవి ఒకటి ఉన్నది. ఆ జీవి (రేడు) ని సూచించడానికి, నవమాత్రా ప్రమాణంలో నడిచే గేయ ఖండంలో అదనంగా మూడు మాత్రల (రేడు) శబ్దాన్ని మూడోపాదం చివర అతకడం జరిగింది. మూడోపాదం చివరనే 'రేడు' శబ్దాన్ని అతకడంలో చక్కని సొగసు ఉన్నది. రేడో కంటె అదిరిపోయె అని నాలుగో పాదంగా వ్రాసి మాత్రల ప్రమాణంలో తేడావల్ల సైన వివరించిన అర్థాన్ని సూచించవచ్చు. కాని 'రేడో-కంటె' అని విరిచి వ్రాయడంలో వచ్చిన సొగసు, కలిపి వ్రాయడంలో రాదు. 'రేడో - కంటె' అనేవిరువువల్ల గతిలో ఒక ప్లుతి కలిగినది. ఆ ప్లుతి రాయని హృదయగతిని అభివ్యంజితం చేస్తున్నది. ఉక్కిరి బిక్కిరి ఊహాలు ముప్పిరిగొనగా ఎగసిపడే రాయని గుండె చప్పుడును 'రేడో - కంటె' అనే విరువు ద్వారా పట్టిచూపినారు.

చతురస్రగతి:- ఇది నాలుగు మాత్రల ఆవృత్తిలో నడిచేఛందస్సు. రగడలలో మధురగతిరగడ చతురస్రగతితో నడుస్తుంది. మధురగతి రగడలో పాదానికి నాలుగు చతుర్మాత్రాగణా లుంటాయి. మొత్తం పదహారు మాత్రలుంటాయి. చతుర్మాత్రాగణాలలో జగణం తప్ప మిగతావి వాడవచ్చు. పదహారు మాత్రలున్న పాదంలో నాలుగు చతుర్మాత్రా గణాలుగాని, రెండెనిమిది మాత్రల గణాలుగాని ఉండవచ్చు. ఎనిమిది మాత్రలున్న గణాలు 3+5గా గాని, 5+3గా గాని, 2+6గా గాని,

6 + 2గా గాని విరగవచ్చు. ఎట్లా విరిగినప్పటికీ చతురస్రగతిలో నడిచే ఛందమ్ము గానే చెప్పుకోవాలి. ఆధునిక కవులు చతుర్మాత్రాగణాలలో జగణాన్ని యథేచ్ఛగా ఉపయోగించి గమన వైవిధ్యం తీసుకొని వచ్చి నారు.

6. చతురస్రగతిలో జగణ ప్రయోగాధిక్యం.

(1) ఇదేమి ! లోకం హిరణ్య నేత్రుని $4+4+4+4$

(2) (య+వ) పదాఘాతమున ప్రతిధ్వనించగ $=8(3+5)+4+4$

(3) (య+న) కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు $=8(3+5)+4+4$

4) (య+వ) గదాఘాతమున–గజగజ లాడగా $=8(8+5)+4+4$

(శ్రీ శ్రీ. మహాప్రస్థానం)

మొదటి పాదం నడకకు, మిగతా పాదాల నడకకు స్పష్టమైన భేదం కనిపిస్తుంది. మొదటి పాదంలో చతుర్మాత్రాక పదాలే వాడటం వల్ల చతురస్రగతి చక్కగా శ్రుతమౌతుంది. వరసగా జగణ, భగణాల ఏకాంతరావృత్తి (Alternate Repetetion) వల్ల ఉద్ధతగమనం కలిగింది. మిగతా మూడు పాదాలు 8 + 8 గా విరుగుతున్నాయి. పూర్వార్ధాలు 3 + 5 గాను, ఉత్తరార్ధాలు 4 + 4 గాను విరుగుతున్నాయి. ఈ మూడు పాదాలలోను పూర్వార్ధ పదబంధాలలో ఉన్నంత బిగువు, ఉత్తరార్ధ పదబంధాలలో కనిపించదు దానికి కారణం పూర్వార్ధ పదబంధాలన్నీ ఏక గణ (యగణ, నగణ) యుతాలు కావడమే ఉత్తరార్ధ పదబంధాలలో భిన్న భిన్నగణాలు ఉన్నాయి. ఈ గేయ ఖండంలో విలోమ గణాలైన యగణ, జగణ బాహుళ్యం వల్లను, పరుషాక్షర సంయోజనం వల్లను ప్రౌఢిమ, ద్రఢిమ చేకూరినాయి. ఈ గేయ ఖండంలో ఎనిమిదేసి మాత్రల

తర్వాత యతి నియమాన్ని పాటించడం వల్ల కూడా నడక అందం అతిశ యించింది.

శ్రీ శ్రీ దేశచరిత్ర

పొలాల నన్నీ జ+గగ
హలాల దున్నీ జ+గగ
ఇలాతలంలో హేమంపిండగ =జ+గగ+గగ+ల

(శ్రీ.శ్రీ; మహాప్రస్థానం)

పై ఉదాహరణలో మూడు పాదాలలోను జగణం తర్వాత 'గగ' ను వరసగా ప్రయోగించడం వల్లను మొదటి రెండు పాదాలలోను చివర వరసగా రెండు గురువులు ప్రయోగించి, మూడో పాదంలో చివర వరసగా రెండు లఘువులు ప్రయోగించడం వల్లను గేయం నడకలో మంచి ఊపు వచ్చింది. మూడో పాదంలో చివర హ్రస్వాక్షరాల ప్రయోగం వల్ల ఒక కుదుపు వచ్చింది. అనుప్రాసలు, అంత్యప్రాసలు, గుర్వక్షర బాహుళ్యం, మూడో పాదంలో అనుస్వార ఆవృత్తి - ఇవన్నీ నడకల అందాన్ని ఇనుమడింపజేయడంలో కలిసి వచ్చినాయి.

పాదానికి 16 మాత్రలు కాక, 14 మాత్రల ప్రమాణంతో రచించిన గేయాలు చతురస్రగతిలోవివి. శ్రీ శ్రీ రచించింది 'అద్వైతం' గేయం మరొకటి.

"నీకంకణ నిక్వాణంలో 6+8 (2+4+4+4
నా జీవన నిర్వాణంలో or (4+4+4+2
or 4+2+4+4

నీ మదిలో డోలలు తూగీ
నా హృదిలో జ్వాలలు రేగీ
నీ తలపున రేకులు పూస్తే

నా వలపుల బాకులు దూస్తే
మరణానికి ప్రాణం పోస్తాం
స్వర్గానికి నిచ్చెన వేస్తాం"

(శ్రీ. శ్రీ మహాప్రస్థానం)

పై గేయఖండం 6+8గా విరుగుతున్నది. అయితే 2+4+4+4 (నీ-కంకణ - నిక్వా-ణంలో), గాగాని, 4+4+4+2 (నీకం-కణని-క్వాణం-లో) గాగాని, లేదా 4+2+4+4 (నీకం - కణ - నిక్వా-ణంలో) గాగాని విరిచి చదవచ్చు. తకిటకు - కిట - తకిటకు-తకిటకు - అనే ఈ నడకలో ఉత్సాహం ఉరకలు వేస్తుంది. (ధ్రువతాళం)-ఈ గేయ నిర్మాణంలో చక్కని శిల్పం ఉన్నది. గేయంలోని పాదారంభాలు, పాదాంతాలన్నీ గురువులు (చాలవరకు దీర్ఘాక్షరాలే) ఉండటం, మొత్తం గేయంలో గురువులు అధికంగా ఉండటం, రెండేసి పాదాలకు అంత్యప్రాసను నియతంగా పాటించడం, అనుప్రాసల బాహుళ్యం - ఇవన్నీ ఆయ అందాన్ని ఇనుమడింపజేసినాయి. శ్రవణ సుభగమైన నాదం, అందమైన నడక, శబ్ద విన్యాసగర్భితమైన నృత్య సంగీతాలు ఈ గేయం ప్రత్యేకత.

ఖండగతి :- ఆధునిక కవులు ఖండ, మిశ్రగతులలో గేయాలు ఎక్కువగా రచించడమే కాక ప్రయోగాలుకూడా అధికంగా కనిపిస్తున్నాయి. అందుకే ఈ రెండుగతులలో జరిగిన ప్రయోగాలను విపులంగా విశదీకరిస్తాను.

ఖండగతి ఐదు మాత్రల ఆవృత్తిలో నడిచే ఛందస్సు. రగడలలో ద్విరదగతి రగడ ఖండగతిలో నడుస్తుంది. ద్విరదగతి రగడలో నాలుగు పంచమాత్రా గణాలు ఉంటాయి. విలోమ గణాలైన జల, యగణాలు తప్ప మిగతా పంచ మాత్రా గణాలు వాడవచ్చు. అయితే ఆధునిక కవులు పాదంలో గణ సంఖ్యను నియతంగా పాటించలేదు. పాదానికి ఒక గణం దగ్గరినుంచి, అనేక గణాల వరకు వాడినారు. ఇటువంటి పాదాలున్న గేయాలకు లక్షణం చెప్పడంలో సంపత్కుమారాచార్య 'తెలుగు ఛందో వికాసము' అనే గ్రంథంలో ఒక పద్ధతిని అనుసరించినారు. పాదానికి నాలుగు గణాలు పాటించిన గేయ ఖండా

న్ని 'పూర్ణ రగడ' అని, మూడు గణాల పాదాలున్న గేయ ఖండాన్ని 'త్రిగణ రగడ' అని, రెండు గణాల పాదాలున్న గేయ ఖండాన్ని 'అర్ధరగడ' అని. ఏకగణ పాదాలున్న గేయాన్ని 'గణపద రగడ' అని సంపత్కుమారాచార్య తన గ్రంథంలో (తెలుగు ఛందో వికాసము) వ్యవహరించినారు. పాదంలో నాలుగుమించి గణాలున్న పాదాల గేయాన్ని 'అధిక గణ రగడ'* అని అనవచ్చు. పాదంలో ఎనిమిది గణాలున్న వాటిని లక్షణ కర్తలు వేరే పేర్లతో వ్యవహరించడం జరిగింది పాదానికి ఐదు, ఆరు, ఏడు గణాలతో చాలా తక్కువగా ఉన్నాయి కాబట్టి ఈ మూడిటిని కలిపి 'అధిక గణ రగడ' అని అనవచ్చు.

## ఖండగతి ప్రయోగాలు – ద్విరదగతి రగడ భేదాలు **

*గణపద రగడ :*

ఒక పువ్వు = 5
విసిగకు = 5
నగయైను = 5
మించినది = 5

అర్ధ రగడ :

పు వ్వు వం - టి వయసు
న వ్వు లం - టిన పొగసు
రు వ్వి నా - ఎద పైన
ప ర్వు తె - త్తావ చే
న వ్వు చే - నువ్వ చె

* ఈ పేరు నేను కల్పించినది.

** ఈ ఉదాహరణలన్నీ సంపత్కుమారాచార్య "తెలుగు ఛందో వికాసం" అనే గ్రంథంనుంచి గ్రహించినాను.

త్రిగణ రగడ :

"ల కుమ బరు - వగురెప్ప - ల ను విచ్చె
రా యనికి - పోవు ప్రా - ణ ము వచ్చె"

పూర్ణ రగడ :

వలి సెజ్జ పై మల్లి య ల రెప్ప లే వాల
పలయునా బ్రతుకు శయ్యా శాంతిలో తేల

### అర్థ రగడ భేదాలు

1. వివృత :-

మడిగాలి – రేగింది – లే
పిడుగు గ - ర్జించింది - లే

మాత్రలు అధికంగా విస్తరించి ఉండటం 'వివృత' రగడ

2. లంబిత :-

మధురమ్ము – నీరీతి
యనుకొంటి – కాని నీ
క్రీగంటి – చూపింత
కరకంచు - నెరుగవే
మానినీ

ఈ విధంగా పాదాన్ని అలంబనం చేసికొని గణమున్న రగడలను 'లంబిత' రగడలని పేర్కొనవచ్చు.

3. (a) సంధిత :-

పువ్వశే - నీ సొగసు

వేలుపుల

ఋవ్వశే - నీ నవ్వు*

(b) సంధితలో వివృత భేదం.

మదనుడొక వంక తో చె = 5 + 5 + 1 = 11

కవలేక = = 5

మొవలోన పూలు పూచె = 5 + 5 + 1 = 11

(సి. నారాయణరెడ్డి; కర్పూర వసంతరాయలు)

అట్లాగే త్రిగణ రగడలో భేదాలు వివృత, లంబిత, సంధిత.

పూర్ణ రగడ భేదాలు :-

1 వివృత

ఎవ్వరే - తూర్పుది - క్కున కుంకు - మము చల్లి - నా?

ఇవ్వరే - నెత్తావి - కెందామ - రలురువ్వి - నా?

కిదారి - లో నండి - నా తల్లి - ఏతెంచు - నా?

ఓదార్పు - లేని ఈ - బ్రతుకు శాంతిని పొందు - నా

2. లంబిత :-

నా రాణి - నా వాణి - నా శశిక - ళవు దేవి

నా బాణి - నా ప్రాణ - ప్రియరహ - స్యము నీవు-దేవి.

---

* ఈ రచనా విన్యాసం 'కస్తూరి - రంగరంగ - మాయన్న - కావేటి రంగరంగ' అనే సంప్రదాయ గీతగతిని తలపిస్తుంది.

3. సంధిత :-

హితులంద - రికి వారి - ఇష్ట దే - వులు కలరు నా ప్రకృ
ప్రకృతి కలిపి - వలపించు - సతివి చతు - రవుదేవి

అసమ ద్వేరద గతులు :-

1. (1) కన్నె కా - టుక కళ్ళు
(2) చిన్ని నా - ధుని చూచి
(3) కదలులా - డిన వేళ
(4) కందళం - [illegible] వేళ
(5) ఆకాశ - మధ్యాన - అట నొక్క - తెలిమబ్బు
(6) మెరపులా - మెరిసింది - లే
(7) వెలుగులో - వొరిసింది - లే.

మొదటి నాలుగు పాదాలు అర్ధరగడ. ఐదోది పూర్ణరగడ [illegible] 6,7 పాదాలు అర్ధరగడలో వివృత రగడ భేదం.

2. (1) కొమ్మలో - కోయిలా - కోయంట - దే
(2) రాగతన - మో ఏమె - బాగువో - గెరుగదే
(3) కొమ్మలో - కోయిలా - కోయంట - దే

(నండూరి సుబ్బారావు, ఎంకి పాటలు)

1, 3 పాదాలు త్రిగడ రగడలో వివృత రగడ భేదం. రెండోది పూర్ణ రగడ.

3. త (1) భూతాన్ని = 5

త
త (2) యజ్ఞోప వీతాన్ని = 5+5

త
త (8) వైప్లవ్య గీతాన్ని నేను = 5+5+3

య (4) స్మరిస్తే పద్యం = 5+4

య (5) అరిస్తే వాద్యం = 5+4

(శ్రీ. శ్రీ. మహాప్రస్థానం)

(6) అనల వేదిక ముందు - అస్ర నైవేద్యం
= 5+5+5+4

వరసగా మూడు పాదాలలో అనులోమ గమనం ఉంది, నాలుగో పాదారంభం నుంచి విలోమ గమనం ఉన్నది. వరసగా ఐదు తగణాల తర్వాత, యగణాలను రెండు పాదాలలోను వరసగా మొదటే ప్రయోగించి అంతవరకూ ఉన్న నడకమీద ఎదురుదెబ్బ తీసినాడు. ఎదురు నడక వల్ల కవి ఆత్మ విశ్వాసం ఆవిష్కృతమైంది. ఈ గేయంలో అనుప్రాసలు, అంత్యప్రాసలు, అక్షర గణాల ఆవృత్తి, పాదాల సాదృశ్యం మొదలైనవి అతని వైచిత్రిని పోషించినాయి

4. ఖండగతిలో నడిచే గేయ ఖండానికి ముందు అధిక గురువును చేర్చి కొంత వింత గతిని సాధించినారు. ఉదాహరణకు

నీ ....
కమ రెప్ప - కొనలవాక
చిమ్మిన - కదల నీ
ప్రళయ కాలానంత - భయదపా - థోరాశి
వలె విశ్వ - మెల్లముం - చెత్తు ను - న్నా
వీ

(7)

పువుచెదర నొకళోక

లవమైన రేగ నీ

(కృష్ణశాస్త్రి కృతులు)

పై గేయఖండంలో ముందు 'నీ' అధిక గురువున్నది. గేయం చివరకూడా అదే గురువున్నది. ఎత్తుకొన్న అక్షరంతో; దించడంతో నడకకు కొత్త తూగు వచ్చింది. పై గేయంలోని 'నీ' అని (మూడు మాత్రల కాలం లాగి) 'కనురెప్ప' అని అందుకోవాలి.*

## ఖండగతి-మరికొన్ని ప్రయోగాలు

1 ఖండగతిలో నడిచే గేయాన్ని పాద విభజన ద్వారా కొత్తగతులను కల్పించటం. ఉదాహరణకు

1. నల్లవాడే
2. గొల్ల
3. పిల్లవాడే
4. చెలియ
5. కల్లగాదే వాని
6. వల్లో చిక్కితినే

(బసవరాజు అప్పారావు గీతాలు)

పై గేయఖండం ఖండగతిలోనిదే పై విధంగా పాద విభజన చేసి వ్రాయడం వల్ల, వేరే పాదాలన్నిటలో మిశ్రగతి సరిపాదాలన్నిటిలో

---

*ఇదే రకమైన నిర్మాణ శిల్పాన్ని సి.నా.రె. ఒక సినిమాపాటలో చూపినాడు త్రిశ్రగతి. "నీ వెలుగు పైట నీడలోన నిలువ నీ"

త్రిశ్రగతి స్ఫురిస్తుంది. పరిపాదాల చివర నాలుగు మాత్రలకాలం విశ్రాంతి తీసుకొంటే మొత్తం గేయం మిశ్రగతిలోకి వస్తుంది. పరిపాదాలలో ఉన్న మాటలను శేష పాదాలలోకి తీసుకొని వస్తే అప్పుడది ఖండగతి అవుతుంది.

వల్లవా - దేగొల్ల
షల్లవా - డె చెలియ
కల్లగా - దే వాని
వల్గొజ - క్కతినే

2. కిన్నెరసాని పాటల కావ్యం చాలవరకు ఖండగతిలో నడుస్తుంది. ఒక్కొక్కచోట ఒక్కొక్క ఛందస్సంవిధానాన్ని పాటించినారు. ఉదాహరణకు 'కిన్నెర నృత్యం'లో

1. చిలుగాలి-లో-నూగు $=7+3$ లేదా $5+5$
2. కొలువంపులో-వీటు $=7+3$ ,,
3. తరి తీవులో కిన్నె $=7+3$ ,,
4. రటు తెచిలుట్లు తెచి $=2+3+2+3=5+5$
5. జల్లు తుంపురులతో -కొల్లలుం పులుతో
$=5+5+5+5$
(తకిట)
6. మెల్ల మె - ల్లన వాడె - నే ....
- రెరటాల $=5+5+2(+3)+5$
7. జల్లులో-ముంచె త్తె-నే (తకిట)

'కిన్నెర నృత్యం'లో ప్రతి గేయఖండానికి ఏడుపాదాలు ఉంటాయి. మొదటి నాలుగు పాదాలు అర్ధపాదాలు. రెండు ఐదు మాత్రల గణాలు ఉంటాయి. మొదటి మూడు పాదాలలో ఐదుమాత్రల తర్వాత గురువు నియతంగా ఉండి, ఆ గురువు పూర్వపదంతో అనుబంధమై ఉండటం వల్ల 7+3మాత్రలుగా విరుగుతుంది. ఐదుమాత్రల తర్వాత ఉన్న గురువు మూడు

పాదాలలోను ఒకే అక్షరం అవృత్తిగా రావడం విశేషం. అట్లాగే మొదటి మూడు పాదాలకు ద్వితీయాక్షర ప్రాస ఉంటుంది. నాలుగో పాదంలో ఖండగతి 2+3 మాత్రలుగా విరుగుతుంది. ప్రాసయతి ఉంటుంది. 'ఇటు, అటు' అనే పదాలమధ్య ఒకే పదం అవృత్తి అవుతుంది. ఐదోపాదం దీర్ఘ పాదం. నాలుగు పంచమాత్రా గణాలు ఉంటాయి. ప్రాసయతి ఉంటుంది. పదపునరుక్తి ఉంటుంది. ఐదు, ఆరు, ఏడు పాదాలకు ద్వితీయాక్షర ప్రాస ఉంటుంది. ఆరు, ఏడు పాదాల నిర్మాణం మరోవిధంగా ఉంటుంది. ఆరో పాదంలో 17 మాత్రలు, ఏడోపాదంలో 12 మాత్రలు ఉంటాయి. ఆరో పాదంలోను, ఏడోపాదంలోను పదిమాత్రల తర్వాత గురువు ఉంటుంది. ఆ గురువు తర్వాత మూడు మాత్రల కాలం విశ్రాంతి తీసుకోవలసి ఉంటుంది.

మెల్ల మెల్లన వాడనే (తకిట) - కెరటాల = 20
జల్లులో ముంచెత్తెనే (తకిట) = 15

ఈ విధంగా ఖండగతిలో గురువు తర్వాత మూడు మాత్రల కాలం విశ్రాంతి తీసుకొనే పద్ధతి తెలంగాణాలో ప్రసిద్ధమైన గౌరమ్మ పాటలో ఉన్నదే

నా నోము నీకిస్తు వే(తకిట)గౌరమ్మ
నీ నోము నాకియ్య వే (తకిట)

## మిశ్రగతి ముత్యాలసరం

గురజాడ అప్పారావు తెలుగు సాలంలోకి అవతరింపజేసిన నూతన ఛందస్సు ముత్యాలసరం. గురజాడ అప్పారావు ముత్యాలసరానికి లక్షణ

చెప్పుతూ "మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పధ్నాలుగేసి మాత్రలుండును. నాలుగో పాదమున యేడు మొదలు పధ్నాలుగు వరకూ వుండును" అని అన్నారు.

గురజాడ అప్పారావు ముత్యాలసరం స్థూల స్వరూపాన్ని గురించి మాత్రమే చెప్పినారు. కాని ముత్యాలసరం ఏవిధంగా నడుస్తుందో వివరించ లేదు. ముత్యాలసరం ఛందస్సుకు నాలుగు పాదాలు ఉంటాయి. మొదటి మూడు పాదాలు సమానమైనవి. చివరి పాదం హ్రస్వపాదం. సమపాదాలలో పాదానికి రెండు సప్తమాత్రాగణాలు($\underline{3+4}\times 2=14$ మాత్రలు) ఉంటాయి. చివరి హ్రస్వపాదంలో సాధారణంగా 9 మాత్రలు ఉంటాయి. ఈ పాదంలోకూడా ఒక సప్త మాత్రాగణం (3+4) మీద ఒక గురువు ఉంటుంది. ఈ రకంగానడిచే ముత్యాలసరమే చాలా ప్రాచుర్యం పొందింది. ముత్యాలసరం నడకనుబట్టి హరిణగతిరగడే. నాలుగోపాదం యతి, ప్రాసలు. అంత్యప్రాసలు మాత్రమే లేవు.

ముత్యాలసరం చివరిపాదంలో సాధారణంగా 9మాత్రలే ఉంటాయి. 9 మాత్రలున్న చివరిపాదాన్ని మూడో పాదంలోకి తీసికొనివస్తే అంటే ముత్యాలసరం నాలుగు పాదాలను మూడు పాదాలుగా వ్రాస్తే భామినీ షట్పది సగభాగానికి సరిపోతుంది. భామినీ షట్పదిలో ఉన్న ప్రసిద్ధమైన జానపద గేయం

గుమ్మ దేదే గోపి తల్లి
గుమ్మదేదే ముద్దు గుమ్మా
గుమ్మదేదే కన్న తల్లి గుమ్మదేదమ్మా

ఇది భామినీ షట్పదిలోని సగభాగం మూడోపాదంలోని 'గుమ్మదే దమ్మా' అనే భాగాన్ని నాలుగో పాదంగా రాస్తే అప్పుడది ముత్యాలసరమే అవుతుంది.

## ముత్యాలసరం-ఛందఃప్రయోగ వైవిధ్యం

1. నాలుగు పాదాలూ సమానంగా ఉన్నవి

దేశమనియెడి దొడ్డ వృతం = 14
ప్రేమలను పూలెత్తవలెనోయ్ = 14
వరుల నెమటను తడిసిమూలం = 14
ధనం పంటలు పండవలెనోయ్ = 14

(గురజాడ ముత్యాల సరాలు)

2. నాలుగో పాదం హ్రస్వపాదం : గురజాడ అప్పారావు నాలుగో చరణంలో 7 నుంచి 14 మాత్రల వరకు ఉంటాయని చెప్పినాడు. నాలుగోపాదంలో 14 మాత్రలు ఉన్నప్పుడు నాలుగోపాదం కూడా సమపాదమై నాలుగు పాదాలూ సమానంగా ఉంటాయి. దీనికి ఉదాహరణలు పైన చూపించడం జరిగింది. ఇక చూడవలసింది 7నుంచి 13 మాత్రల వరకుఉన్న చరణాన్ని. గురజాడ నాలుగో పాదంలో 7 మాత్రలు, 11 మాత్రలు ఉపయోగించిన ముత్యాలసరం ఉదాహరణలు నా పరిశీలనలో కనిపించలేదు. గురజాడ చివరిపాదంలో ఎక్కువగా 9 మాత్రలు వాడినాడు. ఆ తర్వాత 12 మాత్రలు, కొంతవరకు 8 మాత్రలు వాడినాడు. 10 మాత్రలు, 13 మాత్రలు వాడిన పాదాలు ఒకటి రెండు కంటే ఎక్కువగా ఉపయోగించ లేదు.

(A) 9 మాత్రలు :- 9 మాత్రలు ఉపయోగించిన చివరిపాదంలో చివర తప్పనిసరిగా గురువు ఉపయోగించినాడు. అంటే 3+4+ గురువు క్రమంలో విరుగుతుంది

పొత్తు అన్నవి సంపదల కే
అపదలకగు నే = 3+4+గు

(గురజాడ : ముత్యాలసరాలు

(B) 12 మాత్రలు:- గురజాడ చివర 12 మాత్రలు వాడిన పాదంలో కూడా చివర గురువే వేసినాడు. పాదం 3+4+3+ గురువుగా విరుగుతుంది. గురువుకు బదులు రెండు లఘువులు వాడిన ఉదాహరణ ఒకటి మాత్రం లభిస్తున్నది.

కురుల సరులను కుదురు చేయుచు
ఒరమోమిక ఒక్కతిన్ = 3+3+3+ గురువు
(ముత్యాల సరాలు)

3. దీర్ఘపాదాలలో ఒకటి రెండు మాత్రలు ఎక్కువగా ఉన్నవి.

ఉదాహరణకు

1. దేశాభిమానము నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్
(ముత్యాల సరాలు)

పై ఉదాహరణలో చరణారంభంలోనే అధిక గురువు ఉన్నది. అధికంగా ఉన్న గురువును ముందు ఎత్తుకోవాలి. తర్వాతి అక్షరంమీద తాళం పడుతుంది. ఈ రకంగా తాళం పడటం 'అతీతం' అంటారు. ఉదాహరణకు 'దే' ముందు ఎత్తుకోవాలి 'శా' మీద తాళంపడుతుంది. అప్పుడు ముత్యాల సరం నడక కుదురుతుంది. ఈ రకమైన ప్రయోగాలు విశ్వనాథ, అబ్బూరి, శ్రీశ్రీ మొదలైనవారెందరో చేశారు.

ఉదాహరణ :

| | | |
|---|---|---|
| ఈ తామసీ నిశ్శబ్ద హృది మన | = | 16 |
| కిర్వ్వరకు స్వాగతముగా (తక) | = | 14 |
| శ్వేత స్మితామృత శీకర వీచీ | = | 16 |
| నికరము లోలోల యించగా (తక) | = | 14 |

(శ్రీ.శ్రీ. సంపుటాలు-1)

మొదటిపాదం, మూడోపాదం మొదట్లో గురువు అధికంగా ఉన్నది. బేసిపాదాలలో 16 మాత్రలు, సరిపాదాలలో 12 మాత్రలు ఉన్నాయి. సరి పాదాలలో 2 మాత్రలు తగ్గి, బేసి పాదాలలో 2 మాత్రలు పెరిగాయి. బేసి పాదాలలో (గురువు+3+4+3+4) మాత్రలునూ, సరిపాదాలలో 3+4+3+ గురువు క్రమంలో నడుస్తుంది దీనిని కూడా అతీతకాలంలో వచ్చిన అక్షరంగా భావించి పాడుకోవాలి.

*గణానికి గణం విరగడం* :- గురజాడ ముత్యాలసరం గేయాలు ప్రతి మూడు మాత్రలకు నాలుగు మాత్రలకూ పదమో, పదాంశమో కచ్చితంగా విరిగి తీరుతాయి. అంటే మూడో మాత్ర, నాలుగో మాత్ర కలిసి గురువురాదు. అట్లాగే ఏడోమాత్ర, ఎనిమిదో మాత్ర కలిసి, పదో మాత్ర, పదకొండో మాత్ర కలిసి గురువురాదు. ఏ గణానికి ఆ గణం విరిగి తీరుతుంది

A. విరిగి పెరిగితి పెరిగి విరిగితి = 3+4+3+4
కష్ట సుఖముల సారమెరిగితి = 3+4+3+4
(ముత్యాల సరాలు)

పై ఉదాహరణలో పదాలు 3, 4 మాత్రలకు కచ్చితంగా విరుగుతున్నాయి.

*మరొక ఉదాహరణ*

గుత్తునా ముత్యాల సరములు = 5+5+4
కూర్చుకొని తేటైన మాటల = 5+5+4
(ముత్యాల సరాలు)

5+5+4గా విరిచి చదివితే కొత్త గమనం స్ఫురిస్తుంది. అయితే ఈ ఉదాహరణలో పైన వివరించినట్లు మూడోమాత్ర, నాలుగో మాత్ర (అట్లాగే మిగతావి)గురువు రాలేదు కాబట్టి ముత్యాలసరం నడకకు భంగం కలగలేదు.

గుత్తు - నాము - త్యాల - సరములు = 3+4+3+4
కూర్చు - కొనితే - కైన - మాటల = 3+4+3+4
(ముత్యాల సరాలు)

ఈ సందర్భంలో మరొక విషయం చెప్పాలి. ఏ గణానికి ఆ గణం విరుగుతుందంటే పాదాంతంలోని చివరి గణంకూడా విరుగుతుందనే అంటే పాదాంతంలోని చివరి మాత్ర తర్వాతి పాదంలో మొదటి మాత్రతో కలిసి గురువుకాదు. అంటే పాదాంతంలో చివరి మాత్ర హ్రస్వంగాను, తర్వాతి పాదంలోని మొదటి మాత్ర సంయుక్తాక్షరంగాను ఉండవు. గురజాడ అప్పారావు ముత్యాల సరాలన్నీ ఈ విధంగానే ఉన్నాయి. గురజాడ తర్వాతి కవులు దీనికి భిన్నంగా రచించిన ఉదాహరణలు కనిపిస్తున్నాయి ఉదాహరణకు సి. నారాయణరెడ్డి నాగార్జునసాగరంలో

విశ్వ విద్యా నిలయ మదిగో
వివిధ దేశాంతర తరణి
[illegible]యుల బౌద్ధమత ధర్మా
ధ్యాసపీఠముగా[illegible]

(సి. నారాయణరెడ్డి నాగార్జునసాగరం)

రెండో పాదంలోని చివరి అక్షరం మూడో పాదంలోని మొదటి అక్షరమైన సంయుక్తాక్షరంతో కలిసి గురువవుతుంది. ఇది పద్యశిల్పాన్ని సడలించి చేసిన గేయరచన.

అధిక పాదం :- గురజాడ అప్పారావు నాలుగో పాదాన్ని తొమ్మిది మాత్రలతో ముగించి మూడు నుంచి పది మాత్రల వరకు గల పాదాలను అధికపాదం (ఐదోపాదం)గా రచించినారు. ఈ అధిక పాదాన్ని నాలుగో పాదంలోకి తీసుకొనిపోతే ముత్యాలసరం నడక దెబ్బతింటుంది.

ఉదాహరణకు

పసిడి కడ వల పాలపెరుగులు
పల్లె రమ్ములు పళ్లు పువ్వులు
మోము అందున మొలక నవ్వులు
చెలగి చెలికత్తెల్
వెంట నడిచిరి = 8+4
(ముత్యాల సరాలు)

ఈ ఉదాహరణలో 'చెలగి చెలికత్తెల్' అన్న వెంటనే 'వెంటనడిచిరి' అని చదివితే నడక కుంటువడుతుంది. 'చెలగి చెలికత్తెల్' చదివిన తర్వాత సరిగా 6 మాత్రల కాలమాగి 'వెంటనడిచిరి' అంటే లయభంగం జరగదు.

చెలగి చెలికత్తెల్ (తకిటకిట
వెంటనడిచిరి

ముత్యాల సరంలో 8+4 మాత్రలు కాక 4+3 మాత్రలుగా కూడా విరుపులున్న గేయాలు ఒకటి, రెండు ఉన్నాయి.

కాపటి గొపరిన మూడో కన్ను = 3+4+4+8
నివురు లూదిన కొలిమి సెగడ = 8+4+3+3
(కవికొండల: వైతాళికులు?)

శ్రీశ్రీ పాదాంత క్రియలలో ఒక అధిక మాత్ర వాడి చిత్రమైన తూగును తెచ్చినాడు. ఉదాహరణ

కాటసారి కళేబరముతో
శీతవాయువు ఆడుకుంటోంది.
పల్లెటూళ్ళో తల్లికేదో

పాడు కలలో పేగు కదిలింది.

(శ్రీ శ్రీ. మహాప్రస్థానం)

మరో ఉదాహరణ

యమున మహిషపు = 3 + 4
లోహ ఘంటలు = 3 + 4
(లగ) మల్లుబాటున ఖణేల్ మన్నాయి = 3+4+3+4+1.

(శ్రీ శ్రీ. మహాప్రస్థానం)

చివరి హ్రస్వం మీద ఒక మాత్రాకాలం ఆపిరి తీసుకొంటే లేదా గురువుగా ఉచ్చరిస్తే ఆ మాత్ర లేనతుంది. 'ఖణేల్ మన్నాయి' నాలుగో పాదంగా రాస్తే అప్పుడు ముత్యాలసరం నాలుగోపాదం అవుతుంది. మిగతా పై మూడు పాదాలు ముత్యాలసరం గపాదాలవుతాయి.

ముత్యాలసరంలో మూడు మాత్రల స్థానంలో విలోమగణమైన 'లగ'ము ప్రయోగించి నడకలో క్రొత్త ఉద్ధతిని ఉరవడిని కలిగించినవారున్నారు. ఉదాహరణకు శ్రీ శ్రీ ది.

"కూటి కోసం, కూలి కోసం
పట్టణంలో బ్రదుకుదామని
తల్లి మాటలు చెవిని పెట్టక
బయలు దేరిన బాటసారికి
— — — — —
— — — — —
చండ చండం తీవ్ర తీవ్రం
జ్వరం కాస్తే
భయం వేస్తే

ప్రేలాపిస్తే
ఫెళ్ళు పట్టే గాలికొట్టే
వాన వస్తే, వరద వస్తే
— — — —
దారితప్పిన బాటసారికి
ఎంత కష్టం!

(శ్రీ శ్రీ మహాప్రస్థానం)

'చండ చండం... తాండవిస్తే' వరకూ చూస్తే గలం, గగ ప్రయోగాలు ఆ వెంటనే లగ గగ ప్రయోగాలు కొన్ని, ఆ వెంటనే మళ్ళీ, గల గగ ప్రయోగాలు చేసి నడకలో వేగం పెంచినాడు. 'చండ చండం' దగ్గర నుంచి 'ఎంత కష్టం' వరకూ ఎక్కడా విశ్రాంతికి చోటులేదు. 'ఎంత కష్టం' తర్వాత ఒక్కసారి ఊపిరి పీల్చుకొనేటంచే గేయం నడకలో చిత్రమైన తూగు వస్తుంది. శ్రీ శ్రీ దే మరో ఉదాహరణ

విషం క్రక్కే భుజంగాలో
కదం త్రొక్కే తురంగాలో
మదం పట్టిన మాతంగాలో (1 మాత్ర అధికం)
కవీ నీ పాటల్

(శ్రీ. శ్రీ. మహాప్రస్థానం)

లగం వెంట గగం వేసి చిత్రమైన పద్ధతి సాధించినాడు.

కొందరు పాదంలోని మాత్రా సంఖ్యా నియమాన్ని (14 మాత్రలు) పాటిస్తూ 'పేదలు' అనే గేయాన్ని రచించినారు దానిని కొందరు విమర్శ

కులు 'ముత్యాలసరం' గేయంగానే పరిగణిస్తున్నారు అయితే అది ముత్యాలసరంకాదు. మూడు, నాలుగు మాత్రలుగా విరిగినప్పుడే ముత్యాలసరం నడక ఉంటుంది. ఉదాహరణకు

అంతే లేని వేదన గుండెలు = 6+4+4=14
అశ్రువులే నిండిన కుండలు = 6+4+4=14
శ్మశానమున శవ కాంతులలో = 6+4+4=14
[illegible] = 6+4+4=14

(శ్రీ శ్రీ ఖడ్గసృష్టి)

ఇది పైవిధంగా విరుగుతుంది. కాని ముత్యాలసరం నడకలామాత్రం విరగదు.

ముత్యాలసరం ఛందస్సులో మూడు మాత్రల స్థానంలో విలోమగణమైన 'లగం' అవుతుందికాని, నాలుగు మాత్రల స్థానంలో జగణం ఇమడదు. ముత్యాలసరంలో జగణం ఎక్కడా ప్రయోగించలేదు. ప్రయోగించిన ఒకే ఒక్క ఉదాహరణలో నడక కుంటువడింది.

ఈ క| నుసన్న | లెవరి కోసము
ఈ మ| ధు గీతు | లెందుకొరకో (మునిమాపు)

(శ్రీ శ్రీ. ముత్యాలసరం వ్యాసం)

ఈ గేయంలో ముత్యాలసరం నడక కుదరలేదు. నాలుగు మాత్రల స్థానంలో జగణంలో 4,8గా విభక్తమవుతుంది. జగణంలో మధ్య గురువు ఉంటుంది కనుక ఉనికి గురువు మీదనే ఉంటుంది. అప్పుడు గురువుకు

పూర్వం ఉన్న లఘువు పూర్వ గణంతో చేరి 3+4 కు బదులుగా 4+3 క్రమం కన్పించి మిశ్రగతికి భంగం కలుగుతుంది

ఈ విధంగా ఆధునిక కవులు వివిధ గతులలో విభిన్న ప్రయోగాలెన్నో చేసి, గేయఛందస్సుకు పరిపుష్టి కలిగించినారు. ఈ వ్యాసంలో కొన్ని ఉదాహరణలను మాత్రమే దిఙ్మాత్రంగా పరిశీలించడం జరిగింది